శ్రీరస్తు

# విజయవిలాసము

చేమకూర వేంకటకవి ప్రణీతము.



ప్రకాశకుఁడు

పసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు,

బుక్సెల్లర్సు, రాజమండ్రి, ఇన్నీసుపేట.





కాకినాడ:

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1927.

వెల రు 0-12-0

# పూర్వకవుల పద్యకావ్యములు.

## శృంగారనైషధము.

శ్రీనాథుని ప్రణీతము రు 1—0—0.

## శశాంకవిజయము.

శేషము వేంకటపతి విరచితము రు 1—0—0.

## చంపూరామాయణము.

ప్రాసపాటి రంగనాయకకవి కృతము రు 1—0—0.

## పారిజాతాపహరణము.

ముక్కు తిమ్మనార్యు ముద్దుపల్కులు రు 0—12—0.

## బిల్హణీయము.

చిత్రకవి సింగరార్యుని ప్రణీతము రు 0—8—0.

---

పసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు, బుక్సెల్లర్సు, రాజమండ్రి.

క. ఆపుణ్యఫలంబున నెద, యాపాథోరాశి యైనయాలయచ్యుతభూ
మీపతికి రఘునాథ, క్ష్మాపాలుం డుదయ మయ్యెఁ గైవాత్సరుఁ డై. 16

ఉ. పుట్టిన దాదిగాఁ దనదుపుణ్యమె దాదిగ వైరిభూమిభృ
ద్ధట్టమదంబు దాఁచిగ పదాదిగ దిక్శనుతప్రతాపుఁ డై
పట్టమహాభిషేకబహుభాగ్యధురంధరుఁ డై యయోధ్య యా
పట్టణ మేలుసామియె యనన్ రఘునాథవిభుండు వర్ధిలున్. 17

మ. రసికుం డారఘునాథుకీర్తిపతి యారాతోల్ల వాగ్బాధమున్
రసవాదంబును రాజవశ్యవిధి నేరంబోలుఁ గావున్న వె
క్కసపుంబ్రౌఢి వహించి శేషఫణి మూఁగం జేయుఁ దారాద్రి ను
ల్లసము ల్పల్కఁగ ఛత్రిచామరమహాలక్ష్ములన్ శక్యమే. 18

చ. నలువగ నెన్న నైనరఘునాథనృపాలునకు గల్గఁగా మహీ
స్థలి నిఖిలైకధర్మములుఁ దామరలై పరలై చెలంగఁగఁ గో
ల్లలుగస శేషసజ్జనకులంబు సుఖంబు గనెన్ సమస్తవి
ద్యలుఁ గన పెల్లఁ బాసి మొలకొత్తె నెలవ్వెలె సభాతనంబులన్. 19

ఉ. శైలము లెక్కి యష్టమదసామజవాళులమీఁదుగా మహా
కోలమువెన్న దాఁటి పలుగొమ్ములమీఁదఁ బడి సర్వదాశివ
జ్వాలలు గ్రమ్ము శేషుతలచాయనె యోడక వచ్చి కూడె నా
భూలలితాంగి కెంత వలపో రఘునాథనృపాలునందునన్. 20

సీ. రత్నాకరాంతోర్వరావిహారుం డౌట, నగ్రహారము లసంఖ్యాకముగఁ జేసె
నమితదానవినోది యగుటఁ గష్టాంతర, భద్రకుంభీకుణపసందరె
దక్షిణనాయకోత్తముఁ డౌట మేలైన, మలయజగంధిమండలము నేలె
భరతవిద్యాధురంధరుఁ డౌట రంగస్థ, లంబు రామాలంకృతంబు చేసె
తే. నౌర కర్ణాటసింహాసనాధిరాజ్య, భరణనిగుణగుణోద్దండబాహుదండ
జనితసాపత్న్యసంవాదజయగమాన్య, హేలలితకేళి రఘునాథనృపతిమౌళి. 21

శా. రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నీడౌ ననన్
దేజఃప్రౌఢవచోవివేకనయభూతిశ్లాఘలన్ మించు నా
రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నెన్నంగఁగన్
రాజిల్లున్ రఘునాథభూరమణవర్యుం డేధరామండలిన్. 23

సీ. అదిరిసింగపుఁబల్ల మమరించె నేరాజు, మేలుఁ జేసికిఁ బదివేలు వేయఁ
జికిలిబంగరుదిండ్ల పికిలికుచ్చులయందు, లంబెక్కె నేరాజు లక్షనీయఁ

గనకమయంబుగాఁ గట్టించె నేరాజు, సాటిలేనిసగళ్ళు కోటి సేయఁ
గంఠమాలిక మొదల్గాఁ బెట్టె నేరాజు, గొప్పసొమ్ములు పదికోట్లు సేయ
తే. నతఁడు విభుమాత్రుఁడే బహుళాగ్రహార, నిత్యసత్త్రమహాదాననికరపోషి
తాహిమాచలసేతుద్విజాళిగీర్ణ, పుణ్యవిభవుండు రఘునాథభూవిభుండు. 23

చ. త్రికరణశుద్ధి నచ్యుతుని శ్రీరఘునాథనృపాలు వైఖరిన్
సకలమహీసురావళికి సత్త్రము లెప్పుడు బెట్టలేఁడ కా
యొకదొరయందు లెక్కసని యొక్కొకనాఁటికి యింతరొక్కమిం
తకుఁ దెగసాగెనా యనక తా ముద మందినఁ జాలు నెమ్మదిన్. 24

సీ. అడుగుమాత్రమె కాక యంత కెక్కుడుగ నీఁ, జాలెనే యల బలిచక్రవర్తి
యావేళ కటుదోఁచినంతమాత్రమె కాక, కోర్కెకొ చ్చిచ్చెనే యర్కసూతి
తూఁగినమాత్ర మిత్తునని గా కిచ్చెన, చ్చినది కొమ్మనెనే శిబివిభుండు
కలమాత్ర మపుడిచ్చెఁ గాక కట్టన గాఁగ, ననిశంబు నిచ్చెనే యమృతకరుఁడు
తే. వారి నేరీతిఁ బ్రతినీయవచ్చు నెల్ల, యర్థులఁ గృతార్థుల నొనర్చునట్టి యప్ర
తీపవితరణికి మహాప్రతాపతిగ్మ, ఘృణికి నచ్యుతరఘునాథనృపతిమణికి. 25

ఉ. తప్పులు వేయుఁ గల్గినను దాళును నమ్మినవారిపట్లఁ దాఁ
జెప్పినమాట యూర్జితము సేయు నొకం డొరుమీఁదఁ గొండెముల్
సెప్పిన వానికై మఱచి చెప్పిన రీతిగ నెంచు నీడుగా
రిప్పటిరాజు లచ్యుతనరేంద్రుని శ్రీరఘునాథశౌరికిన్. 26

సీ. ఆకారమున నలునంతవాఁ డౌనె కా, హయసమ్యగారూఢి నంతవాఁడె
యతిదయావతి రామునంతవాఁ డౌనె కా, యసమానగురుభక్తి నంతవాఁడె
యనృతోక్తి ధర్మజునంతవాఁ డౌనె కా, యన్నసత్త్రఖ్యాతి నంతవాఁడె
యాలంబునఁ గిరీటియంతవాఁ డౌనె కా, యమితనాట్యప్రౌఢి నంతవాఁడె
తే. రసికమాత్రుండె యంతఃపురగప్రౌఢిఁ, సారసారస్వతాధారశారికాము
కిపవనకృతముఖసుకకళాకలనప్రాప్త, బుధజనాస్థాని రఘునాథభూమిజాని. 27

ఉ. మాటలనేర్పులా సరసమార్గములా కొలు వుండురీతులా
పాటలగంధులా కళలభాగ్యములా బహుదానలీలలా
నాటకశాలలా యొక టనన్యల దెన్నిటఁ జూడ నన్నిటన్
మేటియుఁ గీర్తిలోలుఁడుఁ జుమీ రఘునాథనృపాలుఁ డిమ్మహిన్. 28

వ. అని రఘునాథమహీకాంతు ననంతశోభనగుణమ్ములలోనఁ గొన్ని యభివర్ణించి. 29

తే. నన్ను నడిపించె బహుళసన్మాన మెంచి, యఖిలవిద్యావిశారదుఁ డగుటఁ గాంచి
యవని నింతటిరా జెవ్వఁ డని నుతించి, కృతు లొసఁగఁ గీర్తి కలదని మతిఁ దలంచి. 30

ఉ. తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహి మించిన చో నిఁక శక్తు లెవ్వ రా
య్యారఘునాథభూపరసికాగ్రణికిన్ జెవి సోఁకఁ జెప్పఁగన్. 31

మ. కలిగెం గాఁ దత్సమ్ముఖంబని యె సత్కారంబు తాఁ జేయు వా
తల నెందే శిరసా వహింతు రనియుం దాఁ గాక లేదె దుస్సా
ధులమౌ దిక్కనియుం దయన్ మన పురీతుల్గాక శక్యంబె వి
ద్యల మెప్పింపఁగ నచ్యుతేంద్రరఘునాథస్వామి నెవ్వారికిన్. 32

చ. అని గణియించి రైనను గుణాంశ మెంచక కల్గినం బలా
యను నది గాక మిక్కిలి క్షీణనిజాశ్రితపత్రము గల్గు సత్కృపా
ఖని యణుమాత్రమైన నొకకానుకఁ దెచ్చినఁ గొండగాఁ గనున్
మనమున నచ్యుతేంద్రరఘునాథుఁడె శ్రీరఘునాథుఁ డెన్నఁగన్. 33

క. కావున నే నొనరించిన, యీవిజయవిలాస మనెడి కృతిరత్నంబున్
గేవలభక్తిని గానుక, గావించెద నని నితాంతకౌతూహలినై. 34

క. శుభవాసరమున నయ్యెడ, నిభరాజముఖోపదానిరీక్షేచ్ఛ మహా
ప్రభవాభిరాముఁడై భూ, విభవాకృతి భద్రపీఠవాసోజ్జ్వలుఁడై. 35

సీ. కుందనంపుఁబసిండి కుళ్ళాయి జగలపైఁ, జొక్కట్లనిగనిగల్ చౌకళింప
హుసుముంజిముత్యాలయరచట్టపై గొప్ప, పతకంపుహారము ల్పరిఢవిల్ల
వెలఁజెప్పరానికెంపులవకటము దాఁడి, పీతాంబరంబుపైఁ బెరిమె నెఱప
గబ్బిచున్నెకుమారగండపెండారఁపు, జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప

తే. దొరల మంత్రులఁ గవుల నాదరణ సేయు, కరముకంకణకాంతి నల్గడల నిండ
నిండుకొలువుండెఁ గన్నులపండువుగను, ఠీవి నచ్యుతరఘునాథ భూవిభుండు. 36

తే. అట్టు లొడ్డోలగం బున్న యవసరమున
వినయభయసంభ్రమములు నావెంట నంట
ననుఁ గృపాదృష్టిఁ జల్లఁగాఁ గనుచు నుండ
సమ్ముఖమ్మున కరిగి యంజలి ఘటించి. 37

ఉ. ఏలికమాత్రమే మహిమ నీశ్వరుఁడే తలపోసి చూడ నా
పాలిటిరామభద్రుఁ డని బంగరుఁబూవులఁ బూజచేసి నేఁ
జాల నలంకృతిం బొసఁగుసత్కృతి కానుక చేసి కీర్తి భూ
శ్రీలలితాంగులన్ వలవఁ జేసిన శ్రీరఘునాథశౌరికిన్. 38

ఉ. శ్రీరసభావముల్ దెలియఁ జెప్పి ప్రబంధము లెన్నియేని మీ
పేరిట నంకితం బిడిన బిడ్డల నెందఱఁ జేయువెట్టినన్
దీరదె మీ ఋణం బయినఁ దెచ్చితిఁ గాన్క పరిగ్రహింపు మ
య్యా రఘునాథభూపరసికాగ్రణి మామక కావ్యకన్యకన్. 39

సీ. ఘోటక ఖుర పుట త్రుట్య ద్ధరా జాత, పాంసువుపై నల్లభంబు గాఁగ
భటసింహవిక్రమోద్భటసింహనాదముల్, స్వస్తివాదంబులచంద మొందఁ
బదిదిక్కు లొక్కటఁ బగిలి బీఁటలువాఱ, భేరీనినాదముల్ బోరటిల్ల
విజయ సమారబ్ధ వేళ కౌతుకము, మెంగముఁ గరువంపుమురువు దోఁప
తే. నారఁ బెండ్లికి నేఁగిన ట్లరికి నేఁగి, యాత్మతంత్రంబు లివి యేటిలెక్క యనుచు
లేక మోవక గెల్చుట నీకె చెల్లు, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 40

సీ. ఎంచి రంటివి గాని యీసారి గట్టిగాఁ, దెగుఁ గార్య మనువార్తఁ దెలుపవైతి
మించి రంటివి గాని మేదిని యదరంగ, నడిచె సైన్యం బని నుడువ వైతి
వంచి రంటివి గాని యాభీలరిపుభటో, ద్భటసంగరం బని పలుక వైతి
మొగిసి రంటివి గాని మకుటముల్ త్రెగి రాజ, శేఖరుల్ పడుట సూచింప వైతి
తే. యనుచు నీధాటి కెరవాఱునహితవీరు, లదరు ననుమాట విడలక బెదరి పల్కు-
చారుఁ గని నేర మెంతుర సారెసారె, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 41

సీ. భిన్నకటంబులై పేరు వెంపును లేక, గంధనాగంబు లెక్కడ నడంగె
బాహ్లీక శక సింధు పారసీకోద్భవ, హయదట్టు మేగొంది యందు డిందెఁ
బోటుగంటులఁ దూఱి పోవుదారుణ మైన, మాస్తిలగమి యెందు మ్రగ్గి పోయె
గర్వంబు మేనులు గప్పినట్టు లుండెడి, దొరలయామికి లెందుఁ దొలఁగి పోయెఁ
తే. బయలుపాళెంబు లీరీతిఁ బన్న మొంద, మాయ విన్నను నీఖడ్గ మంత్రివాది
గెలిచినను నేటిమేలైన గెలుపు గంటి, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 42

సీ. రంభ వాకిటను దోరణములు గట్టెను, తీవగ నొకకొంత కిలుపడియెను
మేనక యింటిలో మేల్కట్లు సవరించు, సంరంభ మొకకొంత సడలువాఱెఁ
గనకాంగి యింటిలోఁ గర్పూరవేదికల్, సవరించు టొకకొంత జాగుపడెను
హరిణి బంగరుమేడ రతిసెజ్జలు, నిర్మించు టొకకొంత నిలుకడయ్యె

తే. మబ్బుగొబ్బున నీశౌర్యమహిమ వినక, తెగువతో దుత నెదిరించి తిరిగి విఱిగి
పాఱిపోయినమన్నీలపాటు సూచి, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 53

సీ. అతుల భూరి ప్రతాప పావకార్చి ధాటిచేతఁ, గట్టిగాఁ గాఁకలు పుట్టు పిదప
ఘోరారి గళ రక్త ధారాళ వృష్టిచే, దాని దుక్కికిఁ బదనైన పిదప
హయ దట్ట ఖుర పుట హల్యా ముఖంబున, నంతట దున్నినయట్టి పిదప
మొలచిననీకీర్తి మొలకలు తఱచుగా, వెసవెట్టి పైరు గావించుపిదప
తే. గాపు నిలుపవె బేతాళగణము సెల్ల, నట్టిపట్టుల కరిగి నీ యరుల నోడ
పాటు చేసితి వనుట యేపాటి తలఁప, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 44

సీ. ఒకరు పోయినదెస కొకరు పోవక పాఱి, నరిపీనలకు దాహ గరిమ మించె
గడగడ వడఁకి నల్గడల కేఁగక భీతిఁ, జెందినవారికై జెమట పుట్టె
మన్నాడి యెలగోలు మూఁకలఁ బోట్లాట, పరులపైఁ బాటులప్రభలు మీఱెఁ
జేగ దెమ్మక కొంత సిగ్గుఁ నెదిరించు, రాజులయొప్పు బీరము దొలఁగెఁ
తే. దెగువతో నుత ధరియించి తీవ్రకోప, భరిత రూక్షాక్షి నిరుమిత ప్రభలపేర
నీవు ఘూర్ణార్కసమమూర్తి నెఱపఁ బుడు, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 45

సీ. తలలు వీడఁగఁ బాఱు ధరణీశ్వరులఁ జూచి, యంటి పెన్నాడనియట్టిమహిమ
పసినయేనుంగులప్రక్కల కొడిగిన, రాజులఁ జూడనిరాజసంబు
తెల్లపిల్లచంద్రహాసములు పాఱఁగ వైచి, మిక్కుర వాగలమీఁద మోప్రకరణ
నెత్తురు గనుపట్టి వాత్రిఁ భీతిచేఁ, గలవరించినవారిఁ గాచు కరిమ
తే. మిన్నఁ దనమీఁద బలముతో నెసి మొనసి, కలుగురాణువఁ బొంగ్మను వీరపుని
కీర్తి గంటిమి జగదేక కీర్తనీయ, సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 46

క. అని విన్నవించి పంజిత్తము, ననలొత్తఁ బరిగ్రహించి నాపై నితం
తంత్రానివత్సలత్వము, కనిపిం గపాత్ర భర వికస్వర ముఖుఁడై. 47

తే. కల నయిన మిమ్ముఁ గా కన్యుఁ గొలువ నంటి
కృతులు లోకర కీనా మీకె యంకితము లంటి
పలికినప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు
వాజ్నియమరూఢి నీయంత వాఁడె కేఁడి. 48

క. వాసించుఁ గవిత చెప్పిన, పీసర వో వొకట భక్తివిశ్వాసంబుల్
నీ సామ్యుఁలు సామాన్యుఁడ, నే సూర్యవరప్రసాది నిజ్జగ మెఱుఁగన్. 49

క. ప్రతిపద్యమునందుఁ జమ, త్కృతి గలుగం జెప్ప నేర్తు వెల్లెడ బెళుకా
కృతి వింటి మహారముగా, క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదు సుమీ. 50

తే. క్షత్రధర్మమె కద నీకుఁ గలది మొదలఁ
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముఁ గొలిచి
తిరుగుదు కృతియును జెప్పి మాకిఁ బ్రార్థి
లోకటఁ గావన్నిటను బ్రియోజనుఁడ వీవు. ౬౧

తే. అని సుధామధురోక్తుల నాదరించి, మంజులపదార్థభూషణాంబరకదంబ
కరితురంగాది వాహనోత్కరము లిచ్చి, యన్యసాధారణముగ మన్నన యొసఁగె. ౬౨

చ. అభినవభోజరాజబిరుదాంకుఁడు శ్రీరఘునాథశౌరికిన్
శుభమతి నేలినందులకు సూడిదచేసితి నార మిక్కిలిన్
సభల గణింప మున్నవ లొనర్పఁ బ్రబంధము నింతయుత్తమ
ప్రభువని సంతతం బొనరుపం గలిగెం గద యంచు వేడుకన్. ౬౩

ఉ. ఆఁతి యిచ్చెనా యది కిలాతుర మెక్కని నేర మెచ్చెనా
వానిఁ గృతార్థుఁ జేయఁ బనివాఁ డయినన్ శరణంబుఁ జొచ్చెనా
యానరు నేర మెంచక తెగంతటివాని నొసర్చ నిచ్చెనా
యేనుఁగుపాఁడి యిట్లు గలదే రఘునాథ నృపాలమౌళికిన్.

ఉ. ఎందును విద్వలే యెఱుఁగ రెవ్వ రెఱింగినఁ గొంతమాత్రమే
యందును సాహితీరసమహత్త్వ మెఱుంగ రెఱింగిరేని యా
యంద మెఱుంగలే రెఱిఁగి రుప్పతికిన్ గని మెచ్చి యీయ ర
న్నం దగు సత్యకీర్తి రఘునాథ విభుండె ప్రవీణుఁ డన్నిటన్. ౬౫

సీ. ఏరాజుభుజశౌర్య మేఁగలఖానాది, కఠినశైలిమికి నెక్కవిక్కు
యేరాజువిక్రమ సారంబు విశ్వాసి, మహిమపలాయనమంత్రి కగ్ర
యేరాజువీథి సమీహితకర్ణాట, రమనాట్యవిద్యకు రంగభూమి
యేరాజుచరితంబు నానాశివేష్టిత, మేదినీపతులకు మేలుబంతి

తే. యతఁడు చెలువొందుఁ జినచెవ్వయనృపేంద్ర
బహుజనస్తుణ్యపరిగణ్యఫలనిభాఖ్య
ప్రాప్తిభావప్రమోదసంపూర్ణహృదయ
పంకజాతుండు రఘునాథపార్థివుండు. ౬౬

సీ. సింహాసనము మాట శిథిల మాటలు విని, కట్టిగా నిలుపఁ గంకణము గట్టెఁ
గోటిసంఖ్యలు మీఱఁ గూర్చినధనరాశి, గొల్చువారల కిచ్చెఁ గొల్చువారెన
తుండీరపాండ్యాది మండలేశ్వరులమై, దండెత్తి విడిసె నుద్దండమహిమ
నేల యీనిన యట్లు నిలిచిన వైరుల, బంధించె గాసిమై పాఱఁద్రోచె

తే. గర్వితారాతిమస్తకఖండనోత్థ, రక్తధారానుషంగాతిరక్తధార
నిజకృపాణికఁ గావేరినీటఁ గడిగె, నిఖిలగుణశాలి రఘునాథనృపతిమౌళి. 57

సీ. ఘనఘనాఘనముల కాలసంకెలఁ బెట్టు, పాండ్యుని వెన్నాడి పాఱఁ దఱిమెఁ
దుండీరనాథుండు దూరముగఁ బరవంగఁ, జూచి ప్రాణము దయఁ గాచి విడిచెఁ
గయ్యాన వెనుకఁ ద్రొక్కనిరాజు లెదిరింపఁ, జేరిన రాజకాళికులఁ బట్టెఁ
బోరాడ నారాని వైరులకోటలు, పంపులచే లగ్గపట్టి తివిచె
[illegible] మాన్యుఁడే ధర నెంచి చూడ, విజయనిస్సాణరాణ నిర్విణ్ణహృదయ
భీత [illegible] నిర్భీతి దాన, బిరుద నిజపాణి రఘునాథ భిదురపాణి. 58

ఉ. ఇచ్చినెడన్ బదార్థ మడి గిచ్చునొ తా దయసేయఁ గాదనన్
వచ్చునొ మించి యొక్కఁడన వచ్చునె దానది యిచ్చగించునో
యిచ్చిన నిచ్చెనే పరగ నెవ్వరిపై దయచేసెఁ జేసెనే
యచ్చతురాన్యుఁడుం దెలియఁ డచ్యుత శ్రీరఘునాథుచిత్తమున్. 59

## —: షష్ఠ్యంతములు :—

క. ఏతాదృగ్గుణఖనికిన్, సీతాదృఙ్మోహనాంఘ్రిసేవాధనికిన్
శాతాసికలితబాహా, న్వీతాసికవిమతరాజనిఖిలావనికిన్. 60

క. సాక్షాన్మనోజునకు క్షో, దక్షమరసభావసుకవితాభోజునకున్
దాక్షిణ్యగాంగేయునకున్, దక్షిణసామ్రాజ్యవిభవధౌరేయునకున్. 61

క. సుస్థిరలక్ష్మీమహితవ, ణిస్థగితగృహాంగణునకు సేవాళినృపా
లస్థాపనచణునకు సక, లాస్థానప్రణుత వరగుణాభరణునకున్. 62

క. కీర్త్యాదార్యాధరితా, మర్త్యమహీరుహసుధాబ్ధిమహికాఘృణికిన్
ధాత్ర్యవనరికతిస్పృణికిన్, మూర్త్యంబాగర్భశుక్తిముక్తామణికిన్. 63

క. అఘటనఘటనాచాతు, ర్యఘనోర్జితకార్యనిర్వహణధూర్వహధీ
మఘవాచార్యున కచ్యుత, రఘునాథవసుంధరాధిరాడ్వర్యునకున్. 64

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన విజయవిలాసం బను శృంగార
ప్రబంధమునకుం గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్యమహర్షులకు రౌమహర్షణి
యిట్లని చెప్పం దొడంగె.

# కథాప్రారంభము.



శా. చంద్రప్రస్తర సౌధ ఖేలన పర శ్యామా కుచద్వంద్వ ని
స్తంద్ర ప్రత్యహాలిప్త గంధ కలనా సంతోషిత ద్యోధునీ
సాంద్రప్రస్ఫుట హాటకాంబురుహ చంచచ్చంచరీకోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిల్లు రమాహేలాకళావాసమై.



ఉ. ద్వారక ముద్దుఁ జెల్లెలఁట తన్నగరీమణి సృష్టి యన్నిటం
దీరుగ నైఁచో నిదియ నేర్పులమే రని యెంచి చేసెఁ బో
ధారుణి విశ్వకర్మ గుఱి దానికి నెక్కడ నీడులేనిసిం
గారము గల్గు టట్లు వెనుకన్ సృజియింపక యుండుటే సుమీ. 2

క. వెండియుఁ బైఁడియుఁ దడఁబడు, చుండుం బురి నొందుఁ జూడ నుండఁగవలయున్
భండారము లై యుండటే, యిందుఁ గైలాస మేరు పృథ్వీధరముల్. 3

సీ. తడఁబాటు గలదు వేదముల నాతని కంచుఁ, బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు
కడమాటు పగవానిఁ గని చే మఱచె నంచు, భార్గవు మెచ్చరు బాహుబలులు
పనికి రాకొకమూలఁ బడియె నాతనివస్తు, వని కుబేరుని మెచ్చ రార్యజనులు
వీటిపా లైన నాఁగేటిపాటున మించు, నని హలాయుధు మెచ్చ రంఘ్రిభవులు
తే. పాడిఁ దప్పక ధర్మంబు పట్టువిడక, లక్షులకు నమ్మఁ జాలి నల్గడల భూమి
వరులు మే లనఁ దగి యిట్లు పురిఁ బొలుతురు, చదువుసాముల ధనధాన్యసంపదలను.

ఉ. నీసరి యైనదేవతటినిం గలఁగించెద నీ వడంపుమా
హాసరి శేషపన్నగఫణానివహంబు నటంచు నప్పురిం
బాసలు సేసికొన్న వన భాసిలు సాలశిఖాళి ఖేయమున్
మోసమె యైన విష్ణుపదముం బలిపీఠము ముట్టె నేటికిన్. 5

ఉ. రే లమ్మృతాంశులోకశము రెమ్మద మంచుఁ దలంచి జాళువా
మేలిపసిండిసోయగపు మేడల గుజ్జనగూళ్ళసందడిన్
బాలిక లుండి యావలఁ జనం గని చిందిలి వంటయింటికిం
దే లిది యొండుఁ బోఁగలదు నేఁటికి నే మని యుందు రందులన్. 6

ఉ. పున్నమరేలఁ దత్పురముపొంతను బో శిఖరాళి దాఁకి వి
చ్ఛిన్నకళన్ సుధారసము చిందిపయిం దిగజాఱ నంతనుం
దిన్నెల సన్నగిల్లు నది నిక్కము గా వని రేని యా పదా
ర్వన్నెపసిండిమేడలను రాఁ బని యేమిల సౌధనామముల్. 7

ఉ. వేడుక నప్పురీహరులవేగముఁ గన్గొని లేళ్ళు గాడ్పుతోఁ
గూడి వనన్ స్వలెన్ మనము గూడఁగ నోపక యోడిసట్టివా
[illegible]రి మోచు టని యొద్దికఁ బొందెను వైరి కూడ తే
జోడెరొ కాక మోయఁగఁ బ్రియోజ. మే మనిలుం గురంగముల్. 8

ఉ. చుట్టును గట్టియుండు నొకచో నెడ మించక లేకయుండఁ ద
త్పట్టణబాహ్యభూముల మదావళమండల మేమి చెప్ప ని
ట్టట్టు దెమల్ప రా కరిభయంకరమై దివితోడ రాయుచున్
జెట్టనికోట గాదె గజబృందము లెందును రాజధానికిన్. 9

ఉ. గాళను లాపురీభటశిఖామణు లెక్కటియుక్కుతుక్కు రా
ఖీలతరాళను ల్చిదిమి పెట్టఁ బంటులు వైరి కెల్ల బే
తాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బర గా. దొకదెబ్బ దీయఁగాఁ
జాలుదు రేమి చెప్ప మఱి సాధ్వసేటును సాహసంబులన్. 10

సీ. ఆరామసీమలయందు నుండి పకళ్ళు, ముద మెసంగ వసంతుఁ డెదురుచూచు
మునిమాపుకడలఁ గొన్నెన్నవింటి నెఱజోదు, కేళిమందిరములకెలనఁ జూచుఁ
బొద్దువోయినవేళ రోహిణీప్రాణేశుఁ, డందరిమేడల మీఁద వెదకి చూచుఁ
దెలతెలవాఱఁగ మలయగంధవహుండు, పోరణగండ్లలోఁ జొచ్చి చూచు

తే. నాపురివిలాసవతులయొయ్యారములకుఁ, గడు సొగసి వారి కాకలు కాచి కాచి
విరహులఁ గలఁచువారె యివ్విధము గాఁగ, నున్నవారల నిఁక వేఱె యున్న నేల.

క. మగవానిని మగవాఁడును, మగువను మగువయును వలచు మఱి యేమన న
న్నగరపురాజకుమారుల, జిగిబిగిసోయగము చెలులసింగారంబుల్. 12

చ. పొలయలు కాని యున్న పువుఁబోణులు ఖండితనాయికా లలా
మలు మది నియ్యకోల్ వలయుమానిను లేట్రికి వచ్చె నమ్మ తాఁ
బిలువని పేరఁటం బనుచు బెగ్గిలి నాథులఁ గౌఁగిలింపఁగా
బొలుపుగ నందుఁ బెండ్లినడుపుల్ నడపున్ వలినాలితెమ్మెరల్. 13

ఉ. ప్రాయపుగాయకుల్ త్యాలనెపాన నెగాదిఁగఁ జూడ నేర్పు లా
రా యివి దండ మీఁదఁ గొసరం దొరఁకొంటిరి మంచిసాముకే
పో యటు లైనచో సరసము ల్గన మీ కిపు డంచు నవ్వరిం
గా యజుతూపు లమ్ముగను కందువమాటలఁ బువ్వులావికల్. 14

సీ. గొప్పలై మిన్నందు చప్పరా లెక్కి లాఁ, గులు వైచుచోఁ జంద్రికల లనంగఁ
గనకంబు వర్షించుఘనులమ్రోల నటించి, మెఱయుచోఁ దొలకరి మెఱుపు లనఁగ
మాటికిఁ జూపర మది కాసఁ గొల్పుచోఁ, బ్రతిలేనిబంగారుప్రతిమ [illegible]ఁగఁ
గుపిత నాథులఁ గూర్మిఁ గొసరుజంకెన నాటఁ, గనుచో మరుకలీముఖము [illegible]నఁగఁ
తే. తెలఁగి యింపుగ నగఁ బాడఁ జెప్పఁ జదువ, వలవ వలపింప నేర్చినయలరుఁబోండ్లు
విపుల భరత కళాశాస్త్ర నిపుణ లైన, బిరుదుపాత్రలు గలరు తత్పురమునందు.

సీ. అతివినోదము గాఁగ రతుల మెప్పించు నీ, పచ్చలకడియాలపద్మగంధి
చక్కెరమోవి విచ్చి చవులఁ దేలించు నీ, ముత్యాలకమ్మలముద్దులాడి
తృణముగా లోఁజేయు నెంతటివాని నీ, నీలాలముంగఱనీలవేణి
వెలలేనిపోఁడిక విడివడి మెఱయు నీ, కెంపులబాగడలకీరవాణి
తే. యనుచుఁ దమలోన నెఱజాణతనము మీఱ, వారకాంతామణులమేలువారు తెల్ల
వెన్నెలబయళ్ళ గేలి గావించి నగుచు, విటులు విహరింతు రప్పురీవీథులందు. 16

తే. పోఁకమ్రాఁకులమహిమ కప్పురపుటనఁటి, యాకుఁదోఁటలభాగ్య మందె కలదు
ప్రబలవర్త్తక సౌధసంపదలమహిమ, వీటిరహి మెచ్చవలయుఁ బో వేయునోళ్ళ. 17

ఉ. అణి మెఱుంగుముత్తెపుటొయారపుముగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యపరంతరవాద్యఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించు నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము నై జను లందఱు నుల్లసిల్లఁగన్. 18

ఉ. ఆపుర మేలు మేలు బళి యంచుఁ బ్రజల్ జయవెట్టుచుండ నా
జ్ఞాపరిపాలన వ్రతుఁడు శాంతి దయాకరణుండు సత్యభా
షా పరతత్త్వకోవిదుఁడు సాధుజనాదరణుండు దానవి
ద్యా పరతంత్రమానసుఁడు ధర్మతనూజుఁ డుదగ్రతేజుఁడై. 19

శా. దేవబ్రాహ్మణభక్తిప్రోవు ప్రియవక్తృత్వంబుకాణాచి వి
ద్యావైదుష్యముదిక్కు ధర్మమునకుం దార్కాణ మర్యాదకున్
ఠా వౌచిత్యముజీవగఱ్ఱ హితశిష్టవ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్. 20

సీ. అరలఁబోయిన వెన్కఁ జూచు టెన్నఁడు లేదు, మొగముముందఱ నంటు మొదలె లేదు
మనవి చెప్పినఁ జేయ ననికి యెన్నఁడు లేదు, కొదవగా నడుపుట మొదలె లేదు
వన విచ్చి చౌక చేసినది యెన్నఁడు లేదు, పదరి హెచ్చించుట మొదలె లేదు
మెచ్చిచోఁ గొంచెమిచ్చు టెన్నఁడు లేదు, మొకమిచ్చకపుమెచ్చు మొదలె లేదు
తే. మఱియుఁ దొల్లిటి రాజులమహిమ లెన్న
నితఁడె పో సార్వభౌముఁ డప్రతిముఁ డనఁగఁ
బ్రజలఁ బాలించె సకలదిగ్భసమాన
కీర్తివిసరుండు పాండవాగ్రేసరుండు. 21

సీ. ఎంత లెస్సగ నున్న వేడుకకే కాని, ప్రజలకు లక్ష్మి కనూన పనుట లేదు
తనుఁ గొల్వవలెనంద అను ప్రియుంబే కాని, మానిని వెగటించు టైన లేదు
నిచ్చ వేఁడిన నర్థికిచ్చు చిత్తమె కాని, మును పింత యిచ్చితి ననుట లేదు
లేవగల్ ధర్మ మార్గించుదృష్టియె కాని, న్యాయంబు దప్పిననడక లేదు
తే కలఁడె యిటువంటిరాజు లోకమున నెందు, జలధి వలయిత వసుమతీచక్ర మెల్ల
నేలవలె శాశ్వతముగాఁగ నీఘనుండె, యేలవలె నన్యులన నాన్నపాలుఁ డలరి. 22

ఉ. కోప మొకింత లేదు బుధకోటికిఁ గొంగుఁబసిండి సత్య మా
రూపము తారతమ్యము లెఱుంగు స్వతంత్రుఁడు నాతఁ ప్రియా
టోపము లేనినిశ్చలుఁ డిటుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపరలక్షణుం డనఁగ వచ్చెకొకో యలధర్మనందనుణ్. 23

క. దుర్జయ విమతాహంకృతి, మార్జన యాచనక దైన్య మర్దన చణదోః
ఖర్జులు గల రతనికి భీ, మార్జున నకుల సహదేవు లనువనుజన్మల్. 24

క. పంచామరతరులో హరి, పంచాయుధములొ గిరీశుపంచాస్యములో
యంచున్ సకలజనంబులు, నెంచన్ బాండవులు వెలసి రేవురు ఘనులై. 25

చ ఒరిమయు భక్తియు న్నెనరు నోర్పుఁ గనంబడఁ బెద్దపిన్నయుం
తరవు లెఱింగి మాట జవదాఁటక చెయ్వుల వేఱు లేక యొం
డొరులమనమ్ములో మెలఁగుచుండిరి పాండుకుమారు లెంత నే
ర్పరు లిల నన్నదమ్ములసరాగము వారలదే సుమీ యనన్. 26

ఉ. అన్నలపట్లఁ దమ్ములయొడాటమునన్ సముఁ డంచు నెన్నఁగా
నెన్నిక గన్న మేటి యెడు రెక్కడ లేక నృపాలకోటిలో
వన్నెయు వాసియుం గలిగి వర్తిలుపౌరుషశాలి సాత్త్వికుల్
తన్ను నుతింపఁగాఁ దఱుధార్మికుఁ డగ్రజుఁ డొప్పు నెంతయున్. 27

ఉ. అతని నుతింప శక్యమె జయంతునితమ్ముఁడు సోదరుఁగంబునన్
బతఁగకులాధిపధ్వజునిప్రాణసఖుండు కృశానసంబునన్
క్షితిధరకన్యకాధిపతికిన్ బ్రతిజోదు సమిజ్జయంబునం
దతని కతండె సాటి చతురబ్ధి పరీత మహీతలంబునన్. 28

తే. పాఱఁజూచినఁ బరసేన పాఱఁజూచు, వింటి కొరఁగినఁ రిపురాజి వింటి కొరగు
వేయు నేటికి నలపాండవేయుసాటి, వీరుఁ డిల లేఁడు ప్రతి రఘువీరుఁ డొకఁడు.

క. అతిలోక సమీక జయో, న్నతిచే ధర్మజున కిం పొనర్చుచు వినయా
న్వితుఁడై సమస్త జన స, మ్మతుఁడై వరుఁ డుండె నిటు లమానుషచర్యన్. 30

ఉ. అంతట నొక్కనాఁడు గదుఁ డన్ యదువంశభవుండు రుక్మిణీ
కాంతుఁడు కూరిమిన్ బనుపఁగాఁ గుశలంబరయంగ వచ్చి యే
కాంతపువేళ ద్వారవతియందలి వార్తలు దెల్పుచున్ దటి
త్కాంతి మనోహరాంగు లగు కన్నెలచక్కదనంబు లెన్నుచున్. 31

పంచచామరము. కనన్ సుభద్రికుస్తనంబు గాఁగ నేమృగీవిలో
కనన్ నిజంబు గాఁగ నేజగంబునందుఁ జూచి నా
కినన్ దదీయ వర్ణనీయ హావ భావ ధీవము
కనన్మనోజ్ఞ రేఖ లెన్నఁ గాఁ దరంబె గ్రొక్కనన్. 32

ఉ. ప్రాయపుఁ డెక్కెనన్ జెలువపల్కులు చిల్కల గారవించుఁ గ
న్దోయి చకోరపాళి దయతోఁ బెనుచుం జనుకట్టు మచ్చికల్
సేయు సదా రథాంగయుగళి న్నడ లంచల బుజ్జగించు నా
నేయెడ నింపు గావు గణియింప నవీన వయో విలాసముల్. 33

చ. అతివకు చంబులు న్మెఱుఁగుటూరును వేలియున్ ధరాధిపా
న్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యుదయంబు నిప్పుడొం
దితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్
క్షితి నటు గాదె యొక్కొకరికి న్నడుమంత్రపుఁగల్మి కల్గినన్. 34

సీ. కేళికాసరసిలోఁ దేలియాడుటఁ జేసి, శైవాలలత కొంత సాటిరమ్ముఁ
బువ్వుమాలికలతోఁ బొందు సల్పుటఁ జేసి, యెలదేఁటిగమి కొంత యీడు వచ్చుఁ
గంటి కింపగు రేఖ గల్గియుండుటఁ జేసి, మినుకుఁగాటుక కొంత దిటను వచ్చుఁ
బిఱుఁదునొయ్యారంబు మెఱయుచుండుటఁ జేసి, చమరివాల మొకింతసమము వచ్చు

తే. గాక నీలత్వమున సరి గావు తెలియ
నెఱి గలిగి యొక్క మొత్తమై నిడుదలై ద

లేమ్మలై మెఱుఁగులై కారు క్రమ్ముచున్న
వికచకమలాక్షి నునుసోగ వెండ్రుకలకు. 35

ఆ. నలినలీలనంచు నలినలి గావించు, నించుమించు లాను నించుమించు
లేమనగపుఁజూపు లేమన నగుఁజూపు, జగ మెఱుంగు దాని జగమెఱుంగు. 36

చ జలరుహగంధిపీనకలపసల్ నవసంఖ్య నదేమి లెక్కకున్
జెలియనఖాంకురాళి నెలచేడికు నైకముఁ దాను ఱుక్కకున్
జొలఁతుకగబ్బిచన్నుఁగవ పువ్వులచెండ్లను లేదు బంతనున్
గలికిముఖారవింద మలకల్వలరాయనిఁ దోసిరా జనున్. 37

క. అయ్యారే చెలు వెక్కుడ, నయ్యారే గెలువఁ జాలు నంగజునారి
న్వైయ్యాఱులలో సరి లే, రయ్యా రుచిరాంగరుచుల నయ్యంగనకున్. 38

క. కడు హెచ్చు కొప్పు దానిం, గడవం జనుదోయి హెచ్చు కటి యన్నిటికిన్
గడు హెచ్చు హెచ్చులన్నియు, నడుమే పస లేదు గాని నారీమణికిన్. 39

ఉ. అంగము జాళువాపసిఁడి యంగము క్రొన్నెలవంక నెన్నొసల్
ముంగురు లిందిరా నీలములముంగురు లంగజుఁడాలు వాలుఁజూ
పుంగవ యేమి చెప్ప నృపపుంగవ ముజ్జగ మేలుఁ జేయు న
య్యంగనఁ బోలు నొక్కసకియున్నగనఁ బోనెఱ మించ నన్నిటన్. 40

ఉ. ఎక్కడఁ జెప్పినాఁడఁ దరళేక్షణచక్కఁదనంబు లింక న
మ్మక్కుయుదే మనంగ నిపు డందు శతాంశము దెల్పలేను నే
నొక్కొకయంగ మెంచ వలయుం బదివేలముఖంబు లాయెఁ బో
చొక్కపుఁజూపులో సొలపుఁ జూచినఁ గాక యెఱుంగవచ్చునే. 41

చ. అని బహుభంగులం బొగడ నంగన ముంగల నిల్చినట్లుఁ దాఁ
గనుఁగొనినట్లు నైనృపశిఖామణి డెందమునందుఁ బట్టుఁ జా
లనియనురక్తి నవ్వరవిలాసిని నెన్నఁడు చూడఁ గల్గునో
యని తమకించుచున్నసమయంబున గ్రక్కున దైవికంబునన్. 42

మ. ఒకభూమీదివిజుండు చోరహృత ధేనూత్తంసుఁడై వేఁడికొం
టకుఁ దా ధర్మజుకేళిమందిరముదండం బోయి కోదండ సా
యకము ల్దెచ్చుటఁ బూర్వక్లుప్త సమయ వ్యాయామానుకూలంబుగా
నొకరేఁ డుర్వి ప్రదక్షిణం బరుగు నుద్యోగంబు వాటిల్లినన్. 43

సీ. అన్నకు మ్రొక్కి తీర్థభజనార్థముగాఁ బనివిందు నంచుఁ దా
విన్నప మాచరించుటయు విప్రహితంబునకన్న ధర్మ మే

మున్నది గోప్రదక్షిణమె యుర్వీప్రదక్షిణ మంచు నిట్టు లే
మన్నను మాన కన్నరుఁడు ప్రార్థన సేయఁగ నెట్టకేలకున్. 44

చ. తనదుపురోహితుం డయినధౌమ్యునితమ్ముని గారవంపుచం
దనుని విశారదు న్సకల ధర్మవిశారదు వెంటఁ బోవఁగా
నొనరిచి కొందఱన్ బరిజనోత్తముల న్నియమించి యాదరం
బెనయ సమస్తవస్తువులు నిచ్చి యుధిష్ఠిరుఁ డంపె వేడుకన్. 45

చ. పరిణయ మాట కేగుగతిఁ జారులనేకులు వెంట రా శుభో
త్తరముగ నయ్యెడం గదలి తద్దయుఁ దాలిమి మీఱ ధర్మత
త్పరుఁ డయి యందు నిందు నరపాలుర కానుక లొసంగఁగా నిరం
తరమును బుణ్యతీర్థములఁ దానము లాడుచు నేగి యవ్వలన్. 46

భుజంగప్రయాతము. సుధాసీరసూనుండు సూచె న్నిమ
జ్జనాఘోత్పతత్పంక శంకాకరాత్మో
ర్మినిర్మగ్న నీరేజ రేఖోన్న మద్భృం
గ కేతోత్సవ శ్రీని గంగాభవానిన్. 47

క. సంతోషబాష్పధారలు, దొంతర గాఁ జూచి మ్రొక్కె తోయధివరసీ
మంతిని నాత్రిజగద్ధివ్యాప్తిం భాగీరథీ స్రవంతిని బాగడెన్. 48

శా. తా నైరింప కపర్దయుండఁగ భవ ద్గర్భంబునన్ దాల్చి తే
జోపహ్న్య స్వగజన్ముఁ గాంచి యల నీహార క్షమాభృత్కుమా
రీ సాపత్న్యముఁ గన్న మోహపుఁబురంధ్రీరత్న మా దేవ కా
వే సర్వజ్ఞుఁడు నిన్ను నేల దలపై నెక్కించుకో జాహ్నవీ. 49

క. వెల్లునెగఁ జల్లువిస మా, తెల్లనిదొర కుతిక మోవఁ దిన బ్రతుకుట స
చ్చల్లదనంబునఁ గాదే, కల్లోలవతీమతల్లి గంగా తల్లీ. 50

క. త్వద్వారిబోఁడి వై సరి, యెవ్వారవ భీష్ముఁ గాంచి యిం పొందితి వీ
వవ్వావి యెఱుఁగుదువె మా, యవ్వా పోషింపఁ బాడి యగు నను నీకున్. 51

చ. సకలశుభంబు లిమ్మనుచు సన్నుతు లీగతిఁ జేయ నాప్రవం
తిక దయఁ దెల్పఁ బంచినగతిం జనుదెంచె సుదంచ దూర్మికా
నికర విలోల ఖేల దళినీ కలగాన లసత్ప్రఫుల్ల హ
ల్లక సుఖడోలికా విహృతి లాలస బాలసమీర మయ్యెడన్. 52

క. చనుదెంచిన హే యని య, జ్జననాయకుఁ డలరుచు న్విశారదుఁ గని యీ
యనుకూలమారుతాగతి, గనుఁగొన సామోదసూచకం బైనది గా. 53

తే. తల నీగంగాతీర్థము, చిలికినవాఁ డీశ్వరుండు చేరెఁడులోఁ గోఁ
గలిగినఁ దరఁగలఁ దేలం, గలిగినఁ దన్మహిమ లెన్నఁగాఁ దరమగునే. 54

క. మునుకలు గంగానదిలోఁ, నొనరించుటకన్న భాగ్య మున్నదె యనుచు
న్మను కలుగంగా దిగి పరి, జనములు కైలాసగంగ స్నానోన్ముఖులై. 55

క. తమి నిగుడ గుడాకేశుం, డమరనదీ విమలవారి నాడుచు నుండన్
యమునానదిఁ గూడిన తో, యము నా నది తనరెఁ దత్కచామేచకమై. 56

ఉ. దానము లెన్నియే నచట తైర్థికభూసురసంఘ మెల్ల డెం
దాన మదంబు చెందఁగ నొసర్చి దృఢవ్రతచర్య నిత్యముం
దానము చేయుచున్ హరికథాశ్రవణం బొనరించు చుండె నం
దానముచిద్విమత్తనయుఁ డాశ్రితకల్పమహీరుహాంబకన్. 57

క. భోగవతినుండి యొప్పుగ, భాగీరథికడకు వచ్చి భాసిలు మున్నే
నాగకుమారిక యయ్యెల, నాఁగ యులూపి తమి నొక్కనాఁ డతుఁ జెంతన్. 58

ఆ. హిమకరసైకసైకతమునందు విహరించు, కైరవేషు వేషు ఘనని భాంగు
ననరుదవుల దవులనే చూచి క్రీడిగా, నెఱిఁగి యాఠ యాఠగేందువదన. 59

క. మును ద్రౌపదీస్వయంవర, మున కేఁగిన కామరూపభోగులనలన
స్వని యాన్నకతఁ దమకము, మనమునఁ బెరఁగొనఁగఁ జేరి మాయాన్వితయై. 60

ఉ. గుట్టసియాడ గబ్బిచనుగుట్టలపైఁ బులకాంకురాళుల్
తెట్టువగట్టఁ గోరికలు దేటలు వెట్టఁగ వేఁక ల్మది
ద్దొట్టికొనంగ నచ్చెరువు తొంగలి ఱెప్పల వీఁగ నొత్తఁగాఁ
జెట్టిన దండ దీయక విభీతమృగేక్షణ నూచె నాతనిన్. 61

క. ఏణాక్షి నపుడు వెడనిం, గాణిం గొని యాలగుఁదూఫ్రగమిఁ జక్కారయే
ఘాణముగాఁ గలిగినకం, ఘాణపుదొం పింజపింజ గాడఁగ నేసెన్. 62

ఉ. వైపయిఁ గౌతుకంబు దయివాఱ యిటుండఁగ నంత వజ్జనం
బై పువుఁజప్పరమ్మున నొయారముగాఁ గయిసేసి దానలీ
లాపరతంత్రుఁడై కలకల న్నగుచుం డెసిసవ్యసాచి నిం
ద్రోపలరోచిఁ జూచి తలయూఁచి యులూచి రసోచితంబుగన్. 63

క. సిగ సంపెఁగపూ లొసపరి, వగ కస్తురినామ మొఱపు వలెవా టౌరా
సొగ సిటు లుండఁగవలె నని, సొగసి లతాతన్వి యతనిసొగసు నుతించెన్. 64

క. రాకొమరు నెఱులు నీలపు, రాకొమరు నిరాకరించు రాకాచంద్రున్
రాకొట్టు మొగము కెంజిగు, రాకుఁ గని పరాకు సేయు నౌర పదంబుల్. 65

ఉ. తీరిచినట్టు లున్నవి గదే కనుబొమ్మలు కన్ను లంటిమా
చేరలఁ గొల్వఁగావలయుఁ జేతులయందముఁ జెప్ప గిప్ప రా
దూరులు మల్చివేసినటు లున్నవి బాపురె బొమ్మలోనిసిం
గారము శేషుఁడే పొగడఁగావలె నీతనిరూపరేఖలన్. 66

క. అకటా నన్నితఁ డేలిన, నొకటా కొచ్చికము లేక యుండఁగ నచ్చ
న్నికటామృతధారలు మఱి, నికటారిమెఱుంగు లీతనికటాక్షంబుల్. 67

ఉ. ఆ దరహాసచంద్రికలయందము నాప్తులమీఁదఁ జిల్కు న
త్యాదరశీతలేక్షణసుధారసధారయుఁ జూడఁజూడ నా
హ్లాదము గొల్పఁగాఁ గలకలామహిమంబుఁ దలంచి చూచిన
న్నాదిరి సేయవచ్చు జననాథుమొగంబును జంద్రబింబమున్. 68

ఉ. ఊఁదుకపోవు శంఖము సహా గళరేఖ శరాసనంబుల
న్వాదుకుఁ బట్టి కన్బొమలవైఖరి వంకలు దీరుచుం గటా
క్షోదయలీల సాయకసమూహముల న్విషమాస్త్రుఁ గెల్చుఁ బో
యేదొరసాటి యీనరున కెన్నఁగ వీరవిలాససంపదన్. 69

ఉ. కమ్మనిజాళువా నొరయఁ గల్గిన చెక్కునటెక్కువాఁడు చొ
క్కమ్మగుజాతికెంపు వెలగాఁ గొనుమోవిమెఱుంగువాఁడు స
త్యమ్మగురూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించువాఁ
డమ్మకచెల్ల నాహృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్. 70

సీ. ముద్దాడవలదె యీ మోహనాంగునిమోము, గండచక్కెరమోవి గలఫలంబు
రమియింపవలదె యీ రమణుపేరురముపై, వలిగుబ్బపాలిండ్లు గలఫలంబు
శయనింపవలదె యీ ప్రియునిసందిటిలోనఁ, గప్పు పెన్నెఱికొప్పు గలఫలంబు
వసియింపవలదె యీ రసికుసంకమునందుఁ, జెలువంపుజఘనంబు గలఫలంబు
తే. రాజసము తేజరిల్లునీరాజుఁ గూడి, యింపు సొంపులు వెలయఁ గ్రీడింపవలదె
నాకలోకంబువారల కైన లేని, యలఘుతరభోగభాగ్యముల్ గలఫలంబు. 71

క. అని యిటు లువ్విళ్లూరెడు, మనమునఁ గొనియాడి యంత మాపటివేళం
గనుఁ బ్రామి చొక్కుఁ జల్లిన, యనువున నందఱు వితాకులై యుండంగన్. 72

చ. ఇటు జపియించిన న్విడుతునే నిను నేనిక నంచు జాహ్నవీ
తటమున సంధ్య వార్చి జప తత్పరుఁడై తగువాని యామినీ
విటకులశేఖరుం గొనుచు వే పురికిం జని నిల్పె నట్టె యు
న్నటుల నె మాయ యచ్చుపడ నల్లభుజంగి నిజాంగణంబునన్. 73

క. నిలిపిన జప మెప్పుడిదెలె, జలిపిన వాఁడగుచు పాకశాసని యంతం
దళుకుంబిసాళివాలున్, దెలిగన్నులు విచ్చి చూచె నిర్వ్యాజశోభన్. 74

సీ. దట్టంపుఁదెలినీటి తరఁగచాల్పడఁ గొత్తి, నెలఁతాలజగతిఁ దా నిలుచు టేమి
కొలఁకుఁదామరగంధములఁ గ్రిందఁ బడవైచి, కపురంపుఁదావిఁ దాఁ గవియు టేమి
చివురుజొంపవుటూవిజీబు మాయము సేసి, పసిఁడియుప్పరిగఁ దాఁ బ్రిబలు టేమి
నిద్దంపుటినుమతిన్ని యపామ్ప దిగఁ ద్రాని, యలతులపొమ్పుఁ దా పొత్తు టేమి

తే. మసమసకసంజకెంజాయ మఱుఁగువెట్టి
మిసిమికెంపుల కాంతిఁ దా మెఱయు టేమి
మొదల నే గంగతటి నున్న యదియు లేదొ
మాయయో కాక యిది యంచు మరలి చూడ. 75

సీ. బెళుకుఁగాటుకకంటి సొలపుఁజూపులెసంగ, బట్టియుండెడి పైఁట బట్టియీడ్వఁ
జిగిలిబంగరువ్రాఁత జిలుగుటొయ్యారంపుఁ, బైఁట గుబ్బలగుట్టు బైట వేయ
సొగసుఁగుచ్చెలనీటు నగలు కన్నులపండు, గాఁగ మాయపుఁగొనుఁ గలుగఁజేయ
నిడుదసోగమెఱుంగుజడకుచ్చు గగుర్పొడఁ, బిఱుఁదురేఖను గెల్వ బిరుదుచాటఁ

తే. గంటపరి నంటుకస్తురికమ్మవలపు, కప్పురపుఁబీడి కపురుఁదావి గలసి తొలఁగ
నోఱపులెల్ల నోజ్జయై యుండె నపుడు, భుజగజగామినిమిటారి పొలుపుమీఱి.

క. అటు లున్న కొమరుఁ బ్రాయపుఁ, గుటిలాలకఁ జూచి మదన గుంభిత మాయా
నటనంబో యది గంగా, ఘటనంబో యని విచారఘటనాశయుఁడై. 77

ఉ. తియ్యనివింటివాని వెలతియ్యక డగ్గఱి బాలవయ్యరా
హోయ్యారనూవిలాసి దరహాసము మీసముఁ దీర్ప నప్పు డా
తొయ్యలి వంకఁ గన్గొని వధూమణి యెవ్వరిదాన వీవు పే
రెయ్యది నీకు నొంటి వసియింపఁగఁ గారణ మేమి నావుఁడున్. 78

ఉ. మేలిపసిండిగాజులసమేళపుఁబచ్చలకీల్కడెంపుడా
కేలు మెఱుంగుగబ్బిచనుఁగ్రేవకుఁ జార్చుచు సోగకన్నులం
దేలఁగఁ జూచి యోమదవతీనవమన్మథ యీజగంబు పా
తాళము నే నులూపి యను దాన భుజంగమరాజకన్యకన్. 79

క. సరి లేనివిలాసము గని, వరియించి చిటఁ దోడికొనుచు వచ్చితి నిన్నో
కురువీర వసింపఁగ నీ, కుఱు వీర ద్రుఘ్డాంకపాళిఁ గోరినదానన్. 80

ఉ. పంచెసఁగన్ గటాక్షులమార్గణచేత నె మజ్జగంబు మో
హింపఁగఁ జేయుదాన యిఁక నీవు వహించితి గానఁ గేలి నీ

చంపకగంధి బిత్తరంపుఁ జన్నులమీఁద నఖించుచుందు నా
సంపెఁగమొగ్గ గుల్కిఁగడ సాఁగరి సోమరి గాక యుండునే. 81

క. అనుసచ్చెలి వాక్యంబులు, విని యచ్చెరు వొంది రూప విభ్రమ రేఖా
ఘను లెంచ వాక్శక్యతలే, దని వినుదు నేఁడు నిక్క మయ్యెన్ జూడన్. 82

క. అన్నన్న మొగము వెన్నెల, చిన్నెన్న జయించుఁ గన్ను లన్నన్నలినా
సన్నములు నడుము మిక్కిలి, సన్నము మాటలు సుధాప్రసన్నము లెన్నన్. 83

ఆ. నువ్వుఁబువ్వు నవ్వు జవ్వని నాసిక, చివురు సవురు జవురు నువిద మోవి
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి, మెఱపు నొఱపు బఱపుఁ దెఱవ మేను. 84

క. రవరవలు నెఱపు నీలపు, రవ రవణముతోడఁ జెలి యరాళ కచంబుల్
కవకవ నవ్వున్ వలి జక్కవకవఁ గలకంఠకంఠి కఠినకుచంబుల్. 85

ఉ. చెక్కులయందముల్ మొగము చెల్వము జగ్గవనీటు వేణి చీ
రెక్కడఁ జూడ నన్నిటికి నెక్కువ దీ యన సైకతంబుతో
నెక్కటికయ్యముల్ సలుపు నిక్కటి యొక్కటి చాలదే మరం
దక్కఁగొనన్ రతిన్ గెలచి దక్కఁగొన న్నవమోహనాంగికిన్. 86

చ. అని మది మెచ్చి యొచ్చె మొకయందును లేని మనోహరాంగముల్
గనుఁగొని యాన శావ్రతను గైకొని యుండెడి నన్ను నేల దో
డ్కొని యిటఁ దెచ్చె నీ వెసఁగుఁ గోమలి భూజగ మేడ మారుతా
శనజగ మేడ నెంత ఘన సాహస మింతుల కంచు నెంచుచున్. 87

క. కాముకుఁడఁ గాక వ్రతినై, భూమిప్రదక్షిణము సేయఁ బోయెడివానిం
గామించి తోడి తేఁ దగ, వామగుణ వివేక మించు కైనన్ వలదా. 88

ఉ. నావుడు మోమునన్ మొలకనవ్వొలయన్ వలిగబ్బిగుబ్బచన్
దీవికిఁ గాన టించుక నటించుకవున్ గనిపింపఁ బల్కె రా
జీవదళాక్షి యో రసికశేఖర యో జనరంజనైక లీ
లావహ రూపయో నుత గుణా తగునా యిటు లాన తీయఁగన్. 89

క. నిను గీతసాహితీమో, హనవాణులు చెవులు వట్టి యాడింపంగాఁ
గని యుండి కాముకుఁడఁ గా, వని పల్కన్ నాకు నచ్చి కాని నృపాలా. 90

క. అతులిత విలాస రేఖా, కృతులన్ వలపించి యిటులఁ ద్రిభువనలీలా
వతుల నలయించుటే నా, వ్రత మనఁగా నీవు రూపవంచితమదనా. 91

చ. తెలియనిదానఁ గాను జగతీవర ద్రౌపది యందు ముందు మీ
రేసమయంబు నేర్పఱచి ద్విజార్థము ధర్మజుపాన్పుటింటికిం

కలఁ జని శస్త్రశాల విలు గైకొన టుందునిమిత్త మీవు ని
శ్చలమతి భూపతిరక్షిణముఁ సల్పఁగ వచ్చుట నే నెఱుంగుదున్. 92

తే. చెఱకువిలుకానిబారికి వెఱచి నీవు, మఱుఁగుఁ జొత్తిఁ జేపట్టి మనుపుమన్నఁ
బ్రాణదానంబుకన్నను బ్రతుకు గలదె, యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార.

ఉ. నాయము నీకు మేల్పడినాతి నలంచుట యుత్తమత్స్యయున్
మాయఁగఁ జేసి మున్ దుపదనందన నేలదె యంగభూపతా
కాయతమాత్రీవత్స్య మిపు డల్లనఁ దెల్పఁగ నేని యేలుకో
తీయఁగఁ బంచదార వెను తీయఁగఁ బల్కి నమున్ ద్వితీయుఁగన్. 94

క. అనుడా నృడు రాజకుమారా, వనఁడు సమస్తమ్ము నెఱుఁగువలఁతివి గద యీ
యనుచితము దగునె పరసతి, నెనరూటు రాజులకు ధర్మమే యహిమహిళా. 95

చ. అన విని పాఁపపూపజవరా లెవలో వల పొఁప లేక యా
తని తెలిసుద్దు నెమ్మొగముఁ దప్పక తేటమిటారి కల్కి చూ
పునఁ దనివారఁ జూచి నృపపుంగవ యన్నిట బాల పూరకే
యనవల పంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్. 96

ఉ. కన్నియఁ గాని వేఱొకతెఁ గాను మనోహరరూప నీకు నే
జన్నము వట్టి యుంటి నెలజవ్వన మంతయు నేటిదాఁక నా
కన్నులయాన నా వలపుఁ గస్తురి వాసను తోడు నమ్మ కా
దన్నను నీకు మోవి మధురామృత మానిట బాస సేసెదన్. 97

చ. ఇలపయి మత్స్యయంత్రి మొకయేటున నేసి సమస్తరాజులన్
గెలిచిన మేలువార్త లురగీవరగీతిక లుగ్గడింప నీ
నల నవి చల్లఁగా విని నినున్ వరియింప మనంబు నగ్గి నీ
చెలువము వ్రాసి చూతు నదె చిత్రకువందు ననేకలీలలన్. 98

ఉ. చెప్పెడి దేమి నావలపు చేసినచేఁతలు కొల్వులోన ని
న్నిప్పుడు గంటి నప్పుడ పయిం బడ నీడిచె నిల్వఁ బడ్డపా
టప్పు డదెంత సైఁగల దట్టిమహాశాపాలి కింతసేపు నీ
వొప్పెడిదాఁకఁ దాళుటకు రామా మది మెచ్చవలెగా నృపాలకా. 99

తే. అనిన ఫణిజాతి వీ వేను మనుజజాతి
నన్యజాతిఁ బ్రవర్తించు టగ్గ మగునె
యోలయాకొల్కి యనిన రాచూలి కనియెఁ
జిలువచెలువంపుఁబల్కులఁ జిలువచెలువ. 100

ఉ. ఏ మనఁ బో యెదం దగుల మెంచక నీ విటు లాడఁ దొల్లి శ్రీ
రామకుమారుఁ డైనకుశరాజు వరింపఁడె మా కుముద్వతిన్
గోపలచారుమూర్తి పురుకుత్సునకు న్నర్మదఁ బెండ్లియాడఁడే
నీమన సొక్కఁడే కరఁగ నేరదు గాని నృపాలకాగ్రణీ. 101

ఉ. ఈ కలహంసయాన వను లెక్కడి కెక్కడినుండి తెచ్చె నా
హా కడుదూర మిప్పు డని యక్కునఁ జేర్పక జంపుమాటలన్
వ్యాకులపెట్టు టేల విరహాంబుధి ముంపక పోవు నన్ జలం
బే కద నీకు మంచి దిఁక నీ తమి మిక్కిలి లోఁతు గల్గునే. 102

చ. అని వచియించు నప్పుడు ముఖాబ్జము వంచెడివిన్నఁబాటు చ
క్కని తెలిసోఁగకన్నుఁగవఁ గ్రమ్ముచు నుండెడిబాష్పయు గ్గళం
బునఁ గనిపించు గద్గదిక ముప్పిరి గొన్నవలవంతఁ దెల్పు ని
ట్లను మదిలోఁ గరంగి రసికాగ్రణి యాకరభోరు బోరునన్. 103

ఉ. చక్కెరబొమ్మ నాప్రియము చందమునఁ దెల్పితి నంతె కాక నీ
చక్కఁదనంబుఁ గన్న నిముసం బయిన న్నిలుపోప శక్యమే
యక్కునఁ జేర్పఁ గంచు దయ నాఁతి యిఁకఁ దల వంచె నంతలో
నెక్కడనుండి వచ్చెఁ దగ శేక్షణకు న్ననుసిగ్గుదొంతరల్. 104

ఉ. అంకి లెఱింగి యాసరసుఁ డంత వివాహవిధిజ్ఞుఁ డైనమీ
నాంకుఁ డొసర్చినాఁ డిది శుభైకముహూర్తము రమ్మటంచుఁ బ
ర్యంకముఁ మీఁద నచ్చెలిఁ గరగ్రహణం బొనరించెఁ దన్మణీ
కంకణ కింకిణీగణ వికస్వర సుస్వరము ల్చెలంగఁగన్. 105

మ. ఒకమాణిక్యపుబొమ్మ యెట్టెంగకీలో జాళువా జాలవ
ల్లిక బాగాల్ కప్రంపుటాకుమడుపుల్ వే తెచ్చి రా జున్న చా
యకు నందీయ నతండు తేఁగవుతో నావేళ నావ్యాళిక
న్యక కెంగేల నొసంగి కైకొనియె సయ్యాటంబు వాటిల్లగన్. 106

ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దొడఁగ జాఱెఁ దనంతటఁ జక్కఁదిద్దఁ బోఁ
బయ్యెద జాఱె నయ్యదిరిపాటునఁ గ్రిక్కన నీవి జాఱె రా
జయ్యెడ నవ్విలాసినియొయారముఁ జూచి కవుంగిలించె నా
నెయ్యఁడ మేలె మాతుర గ్రహింపరు జాణలు జాణపాటులన్. 107

ఉ. కౌఁగిటఁ జేర్చునప్పటిసుఖంబె లతాంగికిఁ బారవశ్యమున్
మూఁగఁగఁ జేసె మోవిపలునొక్కు లురోజ నఖాంకముల్ మొదల్

గాఁగలకౌతుకేళిసుఖలక్షణముల్ పయిపెచ్చు లయ్యె న
ట్లాఁగద యెట్టివారలకు నగ్గలపుందమి గల్గి యుండినన్. 108

చ. చనుఁగవ సామకుంభ దెపుడిసాళి యుగంబున సారెఁ గానే
మన ఘనుపుల్ సుధారసము మాటికిఁ గ్రోలనె చూచుఁ జొక్కి గీ
ల్కొను సరసోక్తుల న్వినవె కోరు సదా యిటు లాదిసంగమం
బున నె విభుండు మూఁడువలపుల్ వలచెన్ ఫణిరాజకన్యకన్. 109

తే. నాగరికముద్ర గలయంచ బాగరి యఁట, నాగ వాసనలో వింత నటనలదఁట
పలుకుగుబ్బలప్రాయంబుఁగోమలి యఁట, వలచి వలపింపదే యెంతదారి నైన. 110

క. ఈగతి రతికేళీసుఖ, సాగరమునఁ దేలియున్న సమయంబునఁ ద
ద్భోగం బెటువంటిదొ సద్యోగర్భంబున సుపుత్త్రుఁ డొకఁ డుదయించెన్. 111

క. ఆచక్కని బాలుఁడు వా, క్ప్రాచుర్యకుఁ గాంచునని శుభగ్రహదృష్టుల్
చూచి యిలావంతుం డని, యాచతురుఁడు నామకరణ మలరిచియంతన్. 112

ఉ. కామినిఁ జూచి రమ్య గజగామిని యిక్కడ నొక్కనాఁ డిఁకం
దామస మైన నక్కడ హిత ప్రతి తైర్థికకోటి యాత్మలో
నే మని యెంచునో యిపుడ యేఁగవలెన్ దరువాత నీసుత
గ్రామణి నీవు వచ్చెదరు గా కని యూరడిలంగఁ బల్కుచున్. 113

ఉ. అంటినప్రేమ జాహ్నవికి నప్పుడ తోడ్కొని వచ్చి నల్ల వా
ల్గంటి నిజేశ్వరుం డనఁగ నొప్పు చనుంగవ చేర్చి బాష్పముల్
కంటఁ దొరంగుచుండఁ దిరుగం దిరుగం గనుఁగొంచుఁ గ్రమ్మఱన్
జంట దొలంగి సంజను వెసం జను జక్కవ వెంటియుంబలెన్. 114

ఉ. అంతట రాజురాకఁ గనియాప్తపురోహిత భృత్య వర్గ ము
త్క్రాంత ముదమ్ము చెంది యిటు లార్తిఁ గాచుట కేమొ గాక యే
కాంతము గాఁగ నేఁగుదురె యంచుఁ దలంచితి మీరు వచ్చుప
ర్యంతము మమ్ము మే మెఱుఁగ మందఱుప్రాణము లీవ భూవరా. 115

చ. అని పలుకం బ్రసన్నముఖుఁ డైవిభుఁ డిష్టసఖు న్విశారదుం
గని యొకవింత వింటె ఫణికన్య యులూపి యనంగ నొర్తు న
న్గొని తన నాగలోకమునకుం జని తన్నుఁ గ్రమించ మంచుఁ జె
ప్పని ప్రియ పెల్లఁ జెప్పి యొడఁబాటొనరించి కరంచె డెందమున్. 116

ఉ. చెప్పెడి దేమి కన్నుఁగవ చేరల కక్కుడు చంద్రబింబమే
తప్పదు మోము మోవి సవతా చివు రెక్కడిమాట గొప్పతుం

గొప్పపిఱుందు గబ్బిచనుగుబ్బలు కౌఁగిటి కెచ్చు బాళువా
యొప్పులకుప్ప మేను నడు మున్నదొ లేదొ యెఱుంగ నింతకున్. 117

ఉ. చెంగున దాఁటుఁజూపు లిరుచక్కని బేడిస లేమొ మీటినన్
గ్రింగన వ్రాఁగుగుబ్బలు చొకారపుఁదాళము లేమొ రూప మా
నం గన నైనచెక్కిళులు నానెపుటద్దము లేమొ చొక్క మా
రంగున మీఱు కానియధరంబును గెంపు పసిండి నేమొ నెచ్చెలీ. 11

ఉ. ఆయెలనాగ వేణి మెఱుఁగారుకటారికి మాసటీఁడగున్
బో యనవచ్చు నమ్మెఱుఁగుఁబోఁడి పిఱుందు సమస్త భూమికిన్
రాయ లనంగ వచ్చు నలరాజనిభాస్యయెలుంగు గట్టివా
కోయిలకంచుకుత్తికలకున్ బయకాఁ డనవచ్చు నెచ్చెలీ. 119

క. మదిరాక్షి మోవిజిగి ప్రతి, వదనము గావించుఁ గీరవదనముతోడన్
మదనునివిలు గొనవచ్చున్, సుదతీమణికన్నుబొమలసుదతీ రించన్. 120

చ. అలజడయందము న్మెఱుఁగుటామమిటారము వాయ ముందుగాఁ
జిలువకొలం బటంచుఁ జెలి చెప్పక తొల్తనె చెప్పుఁ దత్తనూ
విలసన మెన్నఁ గన్నదియు విన్నది గా దిలలో లతాంగుల
ప్పొలఁతుకకాలిగోరులకుఁ బోలుపు పోలునొ యేమొ తారకల్. 121

సీ. మరునిగెల్పులకథామహిమమ్ము గలసిల్లు, నొఱపుజిత్తరుతీవి నల్లసిల్లు
వీనుల కమృతంపుసోనలై వర్తిల్లు, శారికాముఖసూక్తి సందడిల్లుఁ
గస్తూరికాదిసుగంధులఁ బ్రభవిల్లు, పరిమళమ్ములజోకఁ బరిఢవిల్లుఁ
జెప్పఁ జూపఁగ రానిసింగారము ఘటిల్లు, పెక్కువిద్యలసొంపు పిక్కటిల్లు
తే. వింతహారువులపసులచే విస్తరిల్లు, దివ్యమాణిక్యకాంతులఁ దేజరిల్లు
నందముల కెల్ల నందమై యతిశయిల్లుఁ, బాఁపజవరాలి బంగారుఁబవెకటిల్లు. 122

క. ఆ భోగము తద్వస్తు చ, యాభోగము నెందుఁ గన్న యవి గావు సుమీ
నాభోగపురము సరి యా, నా భోగవతీపురంబు సార్థం బయ్యెన్. 123

ఉ. ఆమదిరాక్షి భోగవతి యన్నదిఁ గ్రుంకఁగఁ జేసి తత్పుర
స్థేముని హాటకేశ్వరు భజింప నొనర్చిటు తోడి తెచ్చి న
న్నీ మహి నిల్పి యేఁగ నిదె యిప్పుడె నన్నెడఁ బాయలేనియా
ప్రేమ మదింత యంత యని పేర్కొన రాదని తెల్పెఁ దెల్పినన్. 124

ఉ. వాఖరి మించ నిట్టు లను మంత్రిశిఖామణి చోద్య మయ్యె నా
వైఖరి విన్న నే మనఁగ వచ్చు సహో మనుజేంద్ర చంద్రమ

శ్శేఖర చిహ్నాకారలము చేడియ నొక్కటేఁ జెప్ప నేల నీ
రేఖఁ గనుంగొన న్వెలవరే ఖచరీముఖ సుందరీ మణుల్. 125

క. అని పలుక వలరి బలరిపు, తనయుం డట్టు, గదలి మొదలి తైర్థికులును దా
నును మంచుఁగొండ యందరుఁ, జని తచ్ఛిఖ రావలోక జనితాదరుఁడై. 126

సీ. పదియాఱువన్నె గుబ్బలిరాచకూఁతురు, పట్టంపు రాణిగాఁ బరఁగు జాణ
పతి యర్ధదేహంబు సతి యంట నిజముగాఁ, బ్రబలు కన్నియఁ గన్న భాగ్యశాలి
ముజ్జగమ్ములఁ బవిత్రముగఁ జేయుతీర్థమ్ములఁ, గొనసాగఁ జేసి యనఘమూర్తి
భూమిధరారాతిచే మొక్కవోవని, యరిదిబిడ్డనిఁ గాంచి నట్టిమేటి

తే. యోషధుల మొలపించినయాప్తుఁడు
వల్లదనముల కెల్ల దీక్షాగురుండు
సకలమాణిక్యరాశికి జననసీమ
యీనగస్వామి సద్గుణాస్థానభూమి. 127

వ. అని బహుప్రకారమ్ముల హిమగిరిప్రభావము వక్కాణించి తత్ప్రదేశంబున శాఖాశిఖోల్లిఖితగ్లావృత్తుం బగు నగస్త్యవటవృక్షంబుఁ గనుఁగొని, యచట నికటవికటకటకకటకమనీమణిశృంగం బగు మణిశృంగంబు గని యగణ్యపుణ్యాగమసమగ్రం బగుహిరణ్యబిందుతీర్థమ్ముఁ గృతావగాహుండై గోహిరణ్యధరణ్యాదిదానమ్ముల నేకంబులు గావించి, ప్రాగ్భాగముఁ గలికలితపరిశరణ్యం బగు నైమిశారణ్యంబు సొచ్చి, యచటం గోటిగుణితాంగీకృతాంతజనతాసమర్పితనారాయణుం డగు బదరీనారాయణుం బూజించి, మనీషిమనీషితఫలప్రదానశుచిప్రయాగం బగు ప్రయాగంబున కేఁగి, ముముక్షుజనహృదయంగమం బగు త్రివేణీసంగమంబునఁ దానంబులుం దానంబులు గావించి, యచ్చట మాధవు నారాధించి, భవరసానుభవభీరుసానుక్రోశం బగు పంచక్రోశంబుఁ బ్రవేశించి, యభ్యర్ణమణికర్ణ యగు మణికర్ణికం గ్రుంకి, యన్నపూర్ణావిశాలాక్షీసనాథుఁ గాశీవిశ్వనాథుం దర్శించి, తైర్థికసమాహితసమ్యగ యగు గయకుం జని, యచట నుచితకృత్యంబులు నిర్వర్తించి, పురుషోత్తమక్షేత్రంబునకుం జని, యింద్రద్యుమ్న సరస్సున శిరస్స్నమజ్జనం బైనమజ్జన దృక్చకోరజ్యోత్స్నానాథుని జగన్నాథునిఁ గొలిచి, యాతల గౌతమీతటినీతోయస్నాతుండై జగన్మోహనమనోజవశీకరణకారణకళాప్రావీణ్యలావణ్యహావభావప్రకటనటనరేఖా శ్లాఘాదూరీకృతరంభోర్వశీరంభోర్వశీతకిరణకిరణనిభవిభారంగన్మణిరంగమంటపోజ్జ్వలాసికాకృతలక్షణ లాసికా కృతలక్షణకటాక్షవీక్షణసుధారసధారాసేచనకాసేచితాసేచనకాంగుండై, పాపాటవీవిపాటనపాటవసంభావన

దీక్షారామపరమేశ్వరుం డగుదాక్షారామభీమేశ్వరుం జేరి జోహారులు నుపహారంబులు సమర్పించి, సంతతానంతకాంతిరంహుం డగుసంతర్వేది నృసింహు సేవించి యందు భవసాగరతరణి యగుసాగరసంగమంబునఁ దీర్థం బాడి, కృష్ణవేణ్యాదిపుణ్యతరంగిణుల మునింగి, యత్తుంగశృంగవిలోకిలోకసాత్కృతసుపర్వ పర్వతం బగుశ్రీపర్వతంబు లోచనపర్వంబుగాఁ జూచి ప్రణమిల్లి, మల్లికార్జునసమ్మోదమునఁ బ్రణుతించి తన్మనోజ్ఞభ్రమరీవిభ్రమరవ్య యగుభ్రమరాంబం బ్రశంసించి, భక్తశోభనపరంపరాసంపాదకపాదకమలరాజోలేశు నహోబలేశు భజించి, నిజభజనరతజనప్రతిపాదితానశ్వరపదంబు లగుశ్రీవేంకటేశ్వరపదంబులకు నమస్కృతులు విస్తరించి, దుస్తరాంహస్తూలికాసందోహదావాదోహాళనిజాహ్వయస్మరణవిస్ఫులింగం బగుశ్రీకాళహస్తిలింగంబు నంతరంగంబున హర్షతరంగంబు లుప్పొంగం గాంచి, కాంచీపురంబున కరిగి, కరిగిరీశ్వరుం డై విరాజిలువరదరాజుల నమ్రజనకమ్రఫలదాయకు నేకామ్రనాయకుం బూజించి, యవ్వలఁ గావేరికాంతరితకాంతాంతరీపంబునఁ బ్రసన్నరూపంబునం బాటిల్లు కోటిహారిత్తురంగధాముని రంగధాముని సేవించి, కుంభఘోణచంపకారణ్యాదిపుణ్యక్షేత్రమ్ము లీక్షించి దక్షిణనీరాకరవీచికానికరతుందిలమందానిలస్పందసాతిశీతల సికతాతలవిహితయాతాయాత నిరవధిక పథికనికాయకాయమానాయమానవల్యలావల్లీవేల్లితక్రముకప్రముఖాఖిల శాఖిశాఖాశిఖాలతాంతరకుహరవిహరమాణవివిధగరుద్రథకులకలకలోద్వేలవేలామనోజ్ఞమార్గంబున సపర్వగరమేశ్వరం బగురామేశ్వరంబునకుం బోయి, సేతుసందర్శనం బొనర్చి, విధూతస్నాతృప్రపంచజనవృజినజనుష్కోటి యగుధనుష్కోటిం గృతస్నానుఁడై, పాండ్యసూనుం డందులం దులాపురుషాదిమహాదానంబు లాచరించి, రఘువీరభూభుజభుజాదర్పదర్పణం బగురామాయణంబు పారాయణంబు చేసి భూసురాశీర్వాదసంపదలం బొదలి, యచ్చోటుఁ గదలి, పదుమూఁడవనెలఁ బాండ్యమహీమండలాఖండలుం డగుమలయధ్వజుం డేలుమణిపురంబుఁ జేరం బోవు సమయంబున. 128

సీ. మంగళస్నానసంభ్రమముఁ దెల్పెడిరీతిఁ, గలనఁ గెందామరకొలనఁ జేరి
ధవళముల్ విని చొక్కుహవణుఁ దెల్పెడులీల, హాళిఁ గోయిలపల్కు లాలకించి
తెంబ్రిలు వోయుచిత్తరముఁ దెల్పెడుచాయఁ, గ్రొన్నన ల్దోయిళ్ళకొలఁది నొసఁగి
బువ్వానభుజియించుపొల్పుఁ దెల్పెడిజాడఁ, గమిఁ గూడికొనిమరందములు గ్రోలి.
తే. తనరుఁ దోడ్తోడ నను పెండ్లి గనఁబడంగఁ
జేయుఁ గటకటవలె గారబుం జెలులఁ గూడి

వనవిహారంబు గావించి గనెడుపాండ్య
రాజసుతఁ జూచి యాపాండురాజసుతుఁడు. 129

తే. ఈ వెలందియొడల్ పైఁడిలో వెలఁది, యీ వెలందలలాటంబు లేనెలంత
యీసుపాణిరదశ్రేణియే సుపాశి, యీబిడాయ మృగమద శ్రీబిడాయ. 130

క. వాతెఱను నమృతమే తుల, మేతులకింపులపిసాళి మిసిమికిఁ గొప్పిమ్మా
చే తుల చేతుల కబ్జము, లే తుల లేతులవెలఁదు లీచెలి తులయే. 131

క. కన్నెనగుమోముతోడం, బున్నమచందురునిసాటిఁ బోలుపవచ్చు
న్నెన్నదురుతోడ మార్కొని, మున్నందఱుఁ జూడ లేక మోవక యున్నన్.

క. కమలముల నజ్జగించుం, గుముదంబుల బుజ్జగించుఁ గొమమాపులు ప
న్నమచందమామవెలుఁగుల, కొమ వంతయుఁ బుణికి పుచ్చుకొనఁ బోలుఁ జుమీ.

శా. చెండ్లా గుబ్బలు జాళువాతళుకులా చెక్కుల్ శశిడాల్ సింగిణీ
విండ్లా కన్బొమ లింద్రనీలమణులా వేణీరుచుల్ తమ్మిలేఁ
దూండ్లా బాహువు లింతచక్కఁదనమొందుం గాన మీజవ్వని
బెండ్లాడం గలవాఁడు చేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్. 184

మ. అని కన్గొంటె విశారదా యువిద నాహా యే మనస్వామిచ్చె నో
జనవాధాగ్రిణి యీపినూతనతనూ సౌందర్య మీక్షించినన్
దనుఁ దా మెచ్చు విధాతచిత్తమున నీతన్వంగితోఁ బోల్పఁగా
నెన లే దెచ్చటఁ జూడమా తుహినభూభృత్సేతుపర్యంతమున్. 185

క. మలయధ్వజబాహుజనా, స్త్రిలకుని గారాబుఁబట్టి చిత్రాంగద పే
రలఘుతలశీలగుణములు, గల దీకన్య యని చెప్పఁగా వింటి నృపా. 186

క. అన విని మనమునఁ గోర్కులు, కొనసాగఁగ నీనృపాలసుతితో నెయ్యం
బొనరింపవలయు నేఁడి, వ్వని నుండుద మనుచుఁ జొచ్చి వచ్చుచు నుండన్.

సీ. పద్మరేఖలఁ బొల్చుబాలికాతిలకంబు, చరణంబు లూఁదినచెలువుఁ జూచి
మలయధ్వజతనూజకొలువు సేసినజీవ, దంతపుఁజవికెఁ జిత్రమున జూచి
పొన్నగున్నలనీడఁ గన్నెపుప్పొడితిన్నె, మరువబూఁజెఁ జివహాసవుఁ జూచి
కొమ్మ కౌఁగిటఁ జేర్ప గోరంట నంటి, మొనగుబ్బకస్తూరిముసవుఁ జూచి

తే. యీవనము చేసినదికా యదృష్టమనుము, రాజసుతుఁడు చిత్రాంగదపై జవాది
కమ్మతావి గుబాళించుతమ్మికొలని, కెలఁకులకు జేరి యంత త వలపు మీఱె. 188

మ. తనకుం గౌఁగిలి యీ వొకప్పుడును నాథా నీకరస్పర్శనం
బున గిల్గింతలె యంచుఁ బద్మిని కరాంభోజంబునన్ మందమం

దనట ద్వారము చలద్దళాంగులు గన్పట్టఁగ నవ్వెల్గు రా
యని రారా యనిపిల్చె వారు దగ ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనుల్. 139

ఉ. వా విని హీనభావపరిణామవిగుండు విశారదుం డనున్
దేవరివార లింగు నరుదే శకునమ్ములు మంచి వయ్య వే
రావలె శోభనోత్సవపరంపర లిప్పుడ చూడుఁ డంచు నె
త్తావులదీవులై తనరుతామరమొగ్గలు రెండు డోసంగినన్. 140

తే. అదియు నొకశకునంబుగా నధిపుఁ డండి, చేతికం దిచ్చినట్లనె చేకొనంగఁ
గలదు కలికిబ్బికబ్బితచెలిమి యనుచు, నాత్మలో నెంచి యాభావ మపనయించి

చ. నెల యుదయించునప్పు డలనీరజముల్ కుముదంబు లౌను రేల్
కలువలదాయరాకమఁ బగల్ కుముదంబులు నీరజంబు లౌఁ
దలఁపఁగ నింతవింత గలదా యని కందుకమాటలాడుచుం
బళిర కిరీటి మీఱెఁ దనప్రౌఢి విశారదుఁ డెన్నుచుండఁగన్. 142

ఉ. అంగజరాజు పాంథనిచయంబులపై విజయం బొనర్ప నేఁ
గంగ దల చునంతి మును సల్లఁగ గాసులు వట్టుజాళువా
బంగరుటాలవట్టములభంగిఁ గనంబడెఁ బూర్వపశ్చిమో
త్తుంగమహీధరాగ్రములఁ దోయజశాత్రవమిత్రబింబముల్. 143

క. ఒకమెట్టు తరణి డిగ్గఁగ, నొకమెట్టు శశాంకుఁ డెక్కె నుర్విస్థలిలో
నొకరాజు సన్నగిల్లఁగ, నొకరా జంతంతకున్ మహోన్నతిఁ గనఁడే 144

చ. క్షితిపయి కట్టిమాఁకులు జిగిర్వ వసంతుఁడు దా రసోపగుం
భితపదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నసం బ్రస
న్నతయును సౌకుమార్యముఁ గనంబడ జాల్ గరఁగంగఁ జేసెనే
గతి రచియించిరేని పదకాలమువారలు మెచ్చరే కదా. 145

చ. ఔదవిలుకానికిం జెఱకువిల్లును గల్వలకోరి కొరికల్,
గడలుకొనంగ నామనియుఁ గల్వలరాయఁడు నిచ్చి మన్ననం
బడయుఁడు వాని కెక్కుడుగ మౌర్వులు తామును గానకఁ దెచ్చెనాఁ
బడిబడి గంధలుబ్ధమధుపంబులు రాఁ జనుదెంచెఁ దెమ్మెరల్. 146

చ ఒకచిగురాకుఁ గొమ్మఁ బిక ముక్కు ప్రసూనలతాగ్రసీమఁ దేం
ట్లొకఫలశాఖ రాచిలుకయున్ రొద సేయఁగ గాడ్పుపొందు వా
యక పయి వెన్నెలల్ వొలయు నామని సొంపుల నింపు జొంప మో
నొకయెలమావిక్రింద మరుఁడో యనఁగా నరుఁ డుండె నయ్యెడన్. 147

క. విధుచకచకలును బుండ్రే, క్షుధనుర్గుణ సంపదలును శుకపికశారీ
మధులిట్టులు మలయానిల, మధులిట్టులు తద్ధైర్యమహిమఁ గలంపన్. 148

ఉ. చందనగంధి వెన్నడుము చందురులో సగఁబాలు బాలము
ద్దుం దెలిచూపు లంగజునితూపులలోపల మేల్తగ బులిం
దిందిరవేణి మోవి యెలదేనియలో నికరంబు తేట యే
మందము మందయాన మొగమందము మీఱు నవారవిందమున్. 149

ఉ. బంగరుబొంగరాలపరిపాటి చనుంగవ మీలనాటి త
ళ్కుంగనుదోయి చంద్రప్రతికోటి మొగం బెలదేటిధాటిక
న్నుంగడుమేటి వేణి పులిఁబులసాటి పిఱుం దయారె చి
త్రాంగదపాటిజోటి కలదా యని మెచ్చఁ గిరీటి మాటికిన్. 150

క. ఈకరణిఁ దలంచుచు వా, లీకనిభాంగన నెదన్ నిలిపి రేఁ గడిపెన్
లేకటుల నిద్ర వమ్మగన్, రేకగున య్యుతిద నెదను నిల్పినదాఁకన్. 151

తే. అపుడు నృపుఁడు ప్రఫుల్లనవాంబుజప్రసన్నముఖుఁడయి మలయుధ్వజక్షితీశ
కమలహితునకు మాను లాగమనవార్తఁ, దెలుపు మనుచు చారుఁ బిలిచిపనిచె. 152

చ. పనిచిన నేఁగి యాతఁడు నృపాలునిమంత్రిముఖాంతరంబునం
గనుఁగొని యంత్రిసత్స్యము జగఁ దెలుఁపఁగన్ భుజశక్తి నేసి జ
వ్యానిఁ గయికొన్న యర్జునుఁడు వచ్చెననాఁ డిదె తీర్థయాత్ర గా
జనవర యంచు నన్నపము సల్ప సపంభ్రమచిత్తుఁ డైనఁగన్. 153

క. తనవగరువంటిదే చ, క్కనిరగ రొక ప్రాయితంబు గావించి పురం
బు నలంకరింపఁగాఁడే, సివవాఁడై యపుడు సకలసేనలుఁ గొల్వన్. 154

చ. ఎదురుగ వచ్చి పాండ్యవసణీశ్వరుఁ డర్జునుఁ గాంచి నేఁడుగా
సుదినము మీరు రాఁ గలుగుశోభన మెన్నటి కబ్బుఁ బ్రోలికిం
బదుఁ డని యుద్దులుం దొలసి భద్రగజంబుల నెక్కి వచ్చి రిం
పొదవ వాళావళిం గడకు నెత్తెనుపాఁజులదిక్కు సూచుచున్. 155

తే. రాజవీథుల నెసఁగ నీరాజనములు, కటికవా రెచ్చరింప నైకటికభూమి
వందిజనములువొగడఁ జెల్వొంది మిగులఁ, బురముసొత్తెంచె విజయుఁ డబ్బురము గాఁగ.

క. సెట్టుకొని నరునిఁ గనుచో, బట్టణమునఁ గలసమస్తభామల కహహా
యెట్టివిచిత్రము మనసునఁ, బుట్టినవాఁడపుడు మనసుఁ బుట్టించెఁ జుమీ 157

చ. చక్కదనంబు రూపునఁ బొసంగుటె కాదు గుణంబులందునుం
జక్కదనంబు గల్గునెఱజాణ జగంబుల నీడులేని వా

చక్కనిమోముం దొరయఁ జాలినవాఁ డితఁ డల్లుఁ డైనఁ గా
మిక్కిలి కీర్తిగల్గు నని మెచ్చు మనంబున రాజు సారసాక్షా. 158

చ. అదుగదుగందును న్మణిపురాధిపుఁ డిట్లు విశోపచారముల్
గదు నొనరించి యుద్వాహనకౌతుకహేతుకశావిశేష మా
విడిదికిఁ దెచ్చి నిల్పి యతివిస్మయ మందఁగ నింపు మీఱఁగో
లుములగరలన్ ధనంజయుని నెల్లను రంజిలఁ జేసె నెంతయున్. 159

—♦ ఆశ్వాసాంతము ♦—

మ. సరసాశ్రీసరవాసరప్రభుతనూజస్థూలలక్ష్మీపురం
దరజిహ్వాగధురంధరాధరతశాస్త్రప్రాక్షమార్గైకలా
స్యరసాస్వాదనకోవిదా శ్రవణభూషాదివ్యరత్నత్విషా
తరణిశ్రీకరగల్లభా విభవభృత్తంజాపురీవల్లభా. 160

క. యాచకవినుత వనితా, సేచనకఘనోహరాంగ శృంగారకళా
సూచనకమ్రకవిత్వా, లోచనకందళితమాన్యలోలుపహృదయా. 161

క. తరుణీమన్మథ యాశ్రిత, ధరణీసురాధరణశౌర్యహా రాజ్యసురం
ధరసత్యాదిమచక్రి, శ్వరయుధిష్ఠిరభోజరాజవరనిరుపమా. 162

తోటకవృత్తము. అతులాగమశాస్త్రవిరత్తసురే
జ్యతురాధికవిద్వదవాప్తశత
క్రతుతులాభశుభోదయకారణర
త్నతులాపురుషాదికదానచణా. 163

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధప్రసిద్ధసారస్వతసుధాసారజనిత
యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యతనయ వినయధురీణ సకల
కళాప్రవీణాద్యతేంద్రరఘునాథభూపాలదత్తహస్తముక్తా
కటకవిరాజమానవేంకటకవిరాజప్రణీతంబయిన విజయ
విలాసంబను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.





శ్రీ

# విజయవిలాసము.



## ద్వితీయాశ్వాసము.





జానకీమనోహర
పూజాంచితపాత్పయోజపోష్యాఖిలది
గ్రాజ సకలార్థిజనని
ర్వ్యాజకృపా యచ్యుతేంద్రరఘునాథమణీ.

తే. అవధరింపు కథాకర్ణనాతివేల, హర్షు లైనట్టిదివ్యమహర్షులకును
తతసమస్తపురాణకథాశతాంగ, సూతుఁ డై విలసిల్లె నసూతుఁ డనఘ. 2

ఉ. అచ్చెలువంపురాకొమరుఁ డంత వయస్యునిఁ జూచి యింపుతో
నీచతురత్వ మీవినయ మీయుచితజ్ఞత యెందు నేనియుం
జూచితె మైత్రికిం దగినచోటగు శోభనపుం బ్రసంగముల్
సూచన సేసి రాజు మది చొప్పెఱుఁగన్ వలదా విశారదా. 3

మ. అనినన్ మీమదిలోఁ దలంచినది మే లౌ సిద్ధసంకల్పు లీ
రని యావేళనె చిత్రవాహనుఁడు గొల్వై యుండఁగాఁ బోయి యా
యన రా రమ్మని గారవించి సుముఖుం డై రాజుగా రిప్పుడే
మనినా రెయ్యది వార్త యంచుఁ బయిపై నాసక్తితోఁ బల్కఁగన్. 4

చ. అవనితలేంద్ర మావిభునిహర్షమ దే మని విన్న వింతు సం
స్తవ మొనరించి రింతవడి సామిచరిత్రమె వేయినోళ్ళ న
ర్ణవపతితోడ బాంధవ మొనర్చినమాధవు లీలఁ దారు బాం
ధవ మొనరింపఁ జిత్త మిడినారు గుణాంబుధు లీరు గావునన్. 5

క. నా విని సంతోషము మది, నావిర్భవ మొందఁ నామహారాజు నరున్
దేవేరిగ నాకన్నం, బావనగుణ నీయఁ గనుట భాగ్యము గాదే. 6

చ. కల దొకమాటఁ దెల్పఁగలకార్యము దొల్లి ప్రభాకరుండు నాఁ
గలఁ డొకఁ డస్మదీయకులకర్త యతం డనపత్యుఁ డై యచం
చలమతి శంకరుం గురిచి చాలఁ దపం బొనరింప నంతటం
గలుగుఁ గుమారుఁ డొక్కరుఁడు గా నని యిచ్చె వరంబు వేడుకన్. 7

క. అంగజహరునిప్రసాదము, నం గలుగుచు వచ్చె సుతుఁడు నాఁడాదిగ మా
కంగడమున నది యిప్పుడు, పొంగడమై కూఁతు రుద్భవించె న్నాకున్! 8

క. ఆదుహితఁ గుమారుని మ, ర్యాదగఁ జూచి కొనియుందు నాకన్నియకుం
బ్రాదుర్భవించువాని, న్నాదుకులంబునకు వలయు నాథునిఁ జేయన్. 9

క. కా దవరా దీకార్య మ, జాదుల నుబ్రసాద మా విశారద నాకు
న్నాదుహితం బొసఁగూరిచి, నా దుహితం బెండ్లి సేయు నగనాథునకున్. 10

తే. అని యతనిఁ బంచె నామాట కర్జునుండు
సమ్మతించె ముహూర్తనిశ్చయము నయ్యె
హితుఁ డన విశారదుఁడె కాక యెందుఁ గలరె
కోర్కి వెలయంగ దొరఁ బెండ్లికొడుకుఁ జేసె. 11

క. సుత్రామనిభుఁడు పాండ్యథ, రిత్రీవిభుఁ డాత్మీయ శృంగారకళా
చిత్రాంగదయుత యగు నా, చిత్రాంగదఁ బెండ్లికూఁతుఁ జేసిరి కాంతల్. 12

క. గరిత లలంకృతి సేయఁగ, గరువపుమురువపుడు హెచ్చ కన్నియ దవరెం
బరిణయపుంగై సేఁతల, నరపతి యొఱ పతిశయిల్లునటుఁ జెలంగన్. 18

మ. తనకంకేఁబున్నపాలు పెండ్లిఁ గనుతాత్పర్యంబునన్ వచ్చెనో
యనఁ జంద్రుం డలరెం గిరీటి సుముఖుండై యంతఁ గైసేసి తె
చ్చినభద్రేభము నెక్కి శ్రీవిమెయి వచ్చెన్ బాండ్యభూపాలుఁగో
చనముల్ చల్లఁగఁ గ్రొత్తముత్తియపు సేసల్ జవ్వనుల్ చల్లఁగన్. 14

చ. నలుగడ హృద్యవాద్యపటలం బొలయం గపురంపు టారతుల్
వెలయ ద్విజస్తుతుల్ చెలఁగ విప్రవధూశుభగానలీల శో
భిలఁగ వివాహవేదికకుఁ బెండ్లికుమారుఁడు వచ్చె నిట్టు లా
వల నల పెండ్లికూఁతురును వచ్చె రణచ్చరణాంగదంబులన్. 15

శా. పంకేజాతములన్ దిసంతు లడుచున్ బాలామణీపాదముల్
వంకల్ దీర్చు మనోజసాయకములన్ వాల్చూపు లేణాంకునిన్
శంక ల్సేయు మొగంబు జక్కవకవన్ జక్కట్లు దిగ్గుం గుచా
హంకారంబు మదాలిమాలికల నూటాడించు వేణీరుచుల్. 16

క. హరిపతి నడుమున కోడెన్, గరువపు నడుపునకు నోడె గజపతి యిఁక నీ
నరపతి లోనగు టరుదే, వరవర్ణిని మెఱుఁగువాఁడివాల్చూపులకున్. 17

ఉ. చక్కనికన్యకామణికిఁ జక్కనివాఁ డగుప్రాణనాథుఁడుం
జక్కనిశోభనాంగునకుఁ జక్కనియింతియుఁ గల్గు టబ్బురం

చెక్కడ నిట్టు లుండ వలదే రతిదేవికి సాటివచ్చుఁ బో
యిక్కన కాంగి మన్మథుఁ కీడితఁ డీడితరూపసంపదన్. 18

క. అని రూపకళలఁ జూపరుఁ, గొని యాడఁగఁ బేరటాండ్రు గొందఱు తెర వం
చినఁ జూచె నతివ నర్జుగుఁ, దనురాగాంబుధి తటాల్న నటఁ దెరయెత్తెన్. 19

తే. కలదు లే దన నసి యాను కౌనుతీరుఁ
దళుకు మొగముఁ కెగయు గుబ్బలబెడంగుఁ
జూచి యాతనినిడువాలుఁజూపు లపుడు
నిండువేడుక మిన్నంది కొండఁ దాఁకె. 20

చ. చిలుకలకొల్కి గన్గొనియెఁ జేరలఁ గొల్వగ రానికన్నులున్
మొలక మెఱుంగునీలముల మగ్గులు గాఱునొయారిమీసముల్
గలకలనవ్వుచక్కని మొగంబు పెడందయురంబు సింగమున్
గలఁచునువాణపుంగవుని గర్వితమూనుసువీర పుంగవున్. 21

క. అంగజరాజ్యం బేలుట, కుం గట్టితోరణం బోకో యన నతఁ డా
శృంగారవతికిఁ గట్టెన్, మ గళసూత్రంబు చతురిమం గళసీమన్. 22

మ. అనురక్తిం దలఁబ్రాలు వోసె విజయుం డావేళ బంగారుకుం
డన రంగారెడినీలవేణిపయి ముత్యాల్ దోయిటన్ ముంచి చ
య్యనఁ బా ల్పొంగినకైవడిన్ సిరులు పెంపై బూలు రే కెత్తిన
ట్లనె వర్ధిల్లు మటన్న దీవనలకెల్లం దావలం బై తగన్. 23

తే. తామ్రపర్ణీనదీతీరధరణి నేలు
దొరతనముఁ దెల్పఁగా రాశి దొరలఁ బోసె
ముదితచేతులఁ దలబ్రాలు ముత్తియములు
ముదితచేతమ్ము లై సభాసదులు వొగడ 24

క. ఈచందంబునఁ గల్యా, ణోచితకృత్యం బు లెల్ల నొనరిచి యంతన్
రామాలిభోగ్యవస్తు, ప్రాచుర్యమనోజకేళిభవనమునఁ గున్. 25

చ. మినుకుఁగడానిజీనిపనిమేలిమిమంచముపై వసించి యుం
డినయెడ నొయ్యనన్ సఖులు నేర్పునఁ దోడ్కొని వచ్చి మ్రోల జ
వ్వని నిడి తోడిచూపులకు వచ్చి వాయనుబోలె వెక్కసం
జని రవుఁ గాదె పై నతనుసంగరమానవమోహనాంగికిన్. 26

మ. చంచలనేత్రిఁ గాంచి నృపచంద్రుఁడు మోహము నిల్ప లేక చే
లాంచల మంటి శయ్యకపు డల్లనఁ దార్చి కవుంగిలింప నుం

కించుఁ బయంట నంటుఁ గమకించుఁ జలించుట దెప్ప దెప్ప దం
చించుక సేపులోన మెఱయించు ననేకమనోవికారముల్. 27

ఉ. కానుక గాఁగ నిత్తు బిగికౌఁగిలి పల్కవె కీరవాణి నీ
దౌ నుడితేనె నాచెవుల నానఁ గృపారసధార నాన స
న్మానన మెత్తి చూచు చలి నానఁ గోలితనాన నేల లో
నానఁ జలంబు నీకు మఱి నా సుమీ విను నా యింకిటన్. 28

చ. చక్కెరవింటిదేవర ప్రసాదముఁ గైకొను మిప్పు డిందరో
చక్కెరబొమ్మ యంచు విలసన్మణికంకణహస్త మంటి పే
రక్కఱఁ గప్పురంపువిడె మానెఱజాణ యొసంగి నిక్కి లేఁ
జెక్కిలి ముద్దు వెట్టుకొనెఁ జెప్పెడిదే మిఁక నావినోదముల్. 29

ఉ. ఇగ్గరు వెన్కఱం బయికి నీడ్చినఁ బైఁట దొలంగఁ జేతఁ గే
లొగ్గడు రమ్మిపోఁకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం
బిగ్గఁ గడంబు చుట్టి విడిచిపెట్టదు బాలనసం బనేమి యా
సిగ్గుకు సిగ్గు లేదిటులు సేసిన పిమ్మట నుండవచ్చునే. 30

తే. కోర్కె వెలయంగ నినుఁ దెచ్చి కూర్చుకొంటి
తియ్యవిలుకానిబుణ మెందుఁ దీర్చుకొందు
మింద నీచేయి చూచుక యున్నవాఁడు
నింద మని యుండె నీవి నీ వియ్యపున్న. 31

సీ. మకరకేతనుఁ గూర్చి మకరికాలతలు నీ, చెక్కుల వ్రాయంగ మ్రొక్కుకొంటిఁ
గుసుమాకరునిఁ గూర్చి కుసుమమాలికలు నీ, వేనలిఁ దుఱుమంగ వేఁడుకొంటి
గంధవాహునిఁ గూర్చి గంధసారంబు నీ, గుబ్బలఁ బూయంగఁ గోరుకొంటి
మృగలాంఛనునిఁ గూర్చి మృగమదంబుల నీకుఁ, దిలకంబు దిద్దఁ బ్రార్థించుకొంటి
తే. నిన్ను వరియించునప్పుడే యన్ని చేయు, వాఁడ నని మున్ను శృంగారవనములోన
వల పెఱిఁగి యేలుకోఁగదే కలికి యనుచుఁ, గేలి కలయించె నమ్ముద్దరాలి నపుడు. 32

క. పొక్కిలిపొంతఁ గరంబిడి, చెక్కిలిచెంత నొకకొంత చిఱునవ్వొలయన్
జక్కిలిగింతం గొలిపెన్, మిక్కిలి వింతలుగ రతికి మేకొన నంతన్. 33

ఉ. డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరక తత్తరంబునం
జేసిన చేఁతకున్ బదులు సేయ నెఱుంగక మేను మేనితో
రాసినయంత నే కళలు రంజిలి కౌఁగిట వాలయుండెఁ బో
యా సుఖ మింత దంత యన నైనది గాదు గదయ్య క్రీడికిన్. 34

ఉ. అంగజరాజ్యవైభవసుఖాంబుధి నీగతి నోలలాడి చి
త్రాంగద సేవఁ జేయ మలయధ్వజుఁ డిల్లటపల్లుఁ డై తదీ
యాంగబలంబు గొల్వ నరుఁ డండులరాజ్యము సేయు చుండ నా
సింగపుఁజిన్నిలేఁడుము చెల్వకు గర్భము నిల్చె నంతటన్. 35

శా. మించెన్ బోరచికోరికల్ గడు విజృంభించెన్ దనూగ్లాని గా
న్పించెన్ మేచకకాంతి చూచుకములం జెక్కుల్ళ్ళపైఁ దెల్పు ర
ట్టించెన్ గూర్కులు సందడించె నడ చండించెన్ మృదామోదముల్
గాంచెన్ వాతెఱ యోసరించెఁ ద్రివళుల్ నానాఁటికిన్ బోటికిన్. 36

క. సీమంతవతీమణికి, స్సీమంతముఁ జేసి రపుడు నెల లెనిమిదిగా
శ్రీమంతు కెక్కుగర్భ, శ్రీమంతుం డీతఁ డనుట సిద్ధము గాఁగన్ 37

క. పొద్దుల నెలలన్ వేవుర, సద్దులు గాఁ జేయఁ దగుమహోత్సవములు గా
ముద్దులబాలునిఁ గనియెను, బొద్దుల నెలయెసల నిందుముఖి శుభవేళన్. 38

చ. ధనము లసంఖ్యముల్ హితబుధద్విజకోటికి నిచ్చి యప్పు డా
తనయుని బభ్రువర్ణవాహుఁ డట్టును నేలెడు నంచు బభ్రువా
హనుఁ డను పేరు వెట్టి చెలువ దఁగ బంగరుఁదొట్ల బెట్టి శో
భనవిభవాప్తి గంజిలిరి పాండవపాండ్యవసుంధరాధిపుల్. 39

సీ. తనకులస్వామితండ్రిని సుధాంబుధిఁ బోలుఁ, బాలబుగ్గలఎంమలీలఁ గనుటఁ
దనపితామహునిబృందారకాధిపుఁ బోలు, రెప్ప వేయక చూచురీతిఁ గనుట
దనవంశకర్త నుత్పలబాంధవునిఁ బోలుఁ, గరము లక్ష్మిఁ జాఁచి గాగవిలుటఁ
దనతాత యనఁగుదమ్ముని నుపేంద్రునిఁ బోలు, నల్లనల్లన దప్పటడుగు లిడుట

తే. ధరణి గాభీర్యవైభవదాక్షిణ్యపలు, గల వని కనంబడఁగ వేఱ తెలుప నేల
యని గురుజనంబు లెంతయు నాదరింపఁ, జిన్నిబాలుండు ముద్దులు చిలుకుచుండె.

తే. ఆడితప్పనిధర్మజు ననుఁగుఁదమ్ముఁ, డాకుమారుఁ జిత్రవాహనున కపుడు
వశకరుఁగా నొసఁగి వేడ్క నారిచేత, సంపకముఁ గాంచెఁ దీర్థయాత్రాభిరతిని.

మ. చనియాదక్షిణపుణ్యభూమిఁ గనుమన్ సౌభద్రతీర్థంబునం
దును స్నానం బొనరింపఁ బోవ నట మౌనుల్ గొంద ఱోహో నిలుం
డన పైతన్నఖపంచతీర్థములయం దత్యుగ్రనక్రంబు లుం
డును నా శ్రేండులనుండి యిందు నొకవాఁడుం జేరరా దేరికిన్. 42

ఆ. మోతుమునరుఁ బోవ మొసల లెత్తుకొనిపోయె, ననెడువార్త నిక్కమగు నటంచుఁ
గుఱ్ఱింక వెఱతు రెవ్వరును మీర లటుపోకుఁ, డనిన నవ్వుకొనుచు నగ్రజుండు. 43

తే. ఏను దీర్థము లాడఁగ నేఁగుదెంచి, యేకతీర్థము లాడనో డివలఁ జనుల
పౌరుషమెయ్యంచుఁ గ్రుంకఁ బో వారిచరము, పట్టెఁ బట్టె నమ్మహాబాహుబలుఁడు.

క. ఏడమకరంబుఁ గనె య, య్యెడ మకరముఁ బట్టి బయిటి కీడ్చి వైరక్
వడి భూమికిఁ జూపినక్రై, కడిఁ దొల్లిటిరూపు వాసివాసి యొసంగెన్. 45

ఉ. వట్రువగుబ్బలుం దొగరువాతెఱయుం జిఱునవ్వువెన్నెలల్
దొట్రిలుముద్దుమోమును దనుక్కనుమేను వెడందసోగ యై
వట్రిలుకన్నదోయి నిడువాలుఁ గురుల్ బిటువ్రుంబిఱుంద లేఁ
గుట్రిమ నవ్వుక్ గలుగుకోమలి యై యది మ్రోల నిల్చినన్. 46

క. ఆలోలనయనఁ గనుఁగొని, యాలోచనఁ జేసె నృపతి యద్భుతమతి యై
యాలో నిది యచ్చరపో, యాలో కాకల్ల మరునియాలో యనుచున్. 47

క. ఈబాలమోమునకు నా, జాబిల్లి! యెంతవచ్చు సరివచ్చునొకో
యీబిడచనుఁగవ కోకమె, ట్టాబంగరుగట్టు తక్కువౌ నెంచంగన్. 48

క. నడు మెంత సైక మోహో, పిడికిటిలో నణఁగు బెళుకుఁ జేడిసమీలం
గడకొత్తుఁ గన్ను లౌరా, జడయందముఁ జెప్పఁ బాఁప జగతిం గలదే 49

మ. అని యాక్రీడి మనంబునం బొఁడమ యనంగాకారకాండంబు వై
మనుపట్టుంచిన దేమి మేలు చెలువ పుం గల్కి వై యిప్పుడొ
ప్పిన దే మిర్వరిభామినీమణిని నీపే రేమి నా కిట్లనున్
విను మోభూవర యానుపూర్విఁగ బురావృత్తాంత మాద్యంతమున్. 50

క. ఏ నంద యనెడు నచ్చర, చాన దయనేందుధరుని సఖుని యనుంగన్
నా నెచ్చెలులు త్రిలోకీ, యానేచ్ఛలు గలరు కల్వరతులు శుభాంగుల్. 51

ఆ. వారు లలితపద్మసౌరభ్యము సమీచి, యానెడుపేళ్లు గలుగునట్టివారు
జగములెల్లఁ జూచి చనుదెంచుచో మేము, వసధిఁ గాచి నొక్కవనముఁ గాంచి. 52

మ. విహరించుక్ మలయానిలం బచటఁ దావి జిల్కు నెమ్మిని యా
విహరించుక్ బికనాదముల్ చెవికిఁ గాచుం జవుల్ పోద మా
సహకారాళిపదంబుఁ జూడఁగ వయస్యావాళి వాట్రిల్లెడక్
సహకారాళిపదంబుఁ జూడఁగ వయస్యాహాళి యానే కదా. 53

క. అని యితరేతరచతురో, క్తిని గుంభన మెఱయ నరిగి తేఁకువ నందున్
మునియొకఁడు దపము సేయం, గని యది విఘ్నంబు సేయఁ గడఁగిక డెంకన్. 54

క. నెఱికురులు గేలుఁజికురులు, నిఱివన్నెలు విరివికన్ను లించుకకానుల్
జిఱుఁదొడలు నాచనడలుక్, మెఱుపులయొఱపులు ఘటింప నిలిచి నటింపన్. 55

క. మాపాలిఁ బ్రాకింత గనుఁగొని, తాపసుఁ డంట వలపు పేరు దైవ మెఱుంగన్
శాప మొసఁగె మకరులు గాఁ, గోపరసావేశమూర్తి కుటిలేక్షణుఁడై. 56

క. అందులకుఁ జాల భయపడి, కుందుచు ముకుళులకు వ్రాలి యతిదీనతతోఁ
గొందలపడ నపు డాతని, డెందము గైకొనియె నక్కటికపుం బెంపున్. 57

ఉ. శీతలదృష్టిఁ జూచి మునిసింహుఁడు నావచనం బమోఘ మో
భీతమృగాక్షులార మది బెగ్గిల నేల యిఁకన్ వినుండు మీ
చేత గృహీతుఁ డై సలిలసీమను నెవ్వఁడు వెల్వరించు మి
మ్మాతఁడె శాపమోక్షకరుఁ డయ్యెడుఁ బొం డని పంచెఁ బంచినన్. 58

చ. ఇలఁ గలనీళ్ళు నూఁత మన మేటికిఁ బోవలెఁ బోయినన్ దని
న్నిలువఁ బనేమి నిల్చిన మునిం గని తుళ్ళఁగ నేల యంతలో
నలిగి శపింప నేమిటికి నాతఁడు వ్రాఁతఫలంబు దప్పునే
కలిగినవే కదా మకరికల్ మన కెప్పుడు వ్రాసి యుండుటల్. 59

తే. అనుచు ననుతాపమునఁ దోవఁ జనుచు నుండ
నారదుఁడు సూచి యచ్చరలార మీరు
చిన్నవోయిన మొగముల నున్న వార
లే మనినఁ బూర్వవృత్తాంత మెల్లఁ దెలిపి. 60

తే. ఋషితిలక కంటివే మాయదృష్ట రేఖ, కుడిచికూర్చుండి యిదె యొక బెడఁదదెచ్చు
కొంటి మే మేడ మకరులై యుంట యేడ, నహహ మే ముట్టిబాధ బడి బాధ్యలము. 61

క. అన విని యమ్మునిముని యో, వనితాతిలకంబులార వసుధాగీర్వా
ణునిశాపము విధికృత మే, ఘనునకుఁ దప్పింప నలవి గా దటు లగుటన్. 62

ఉ. మీరలు దక్షిణాంబుధిసమీపమునం దగు పంచతీర్థముల్
చేరియు గ్రాహరూపముఁ జెంది శతాబ్దము లున్నఁ దీర్థసే
వారతి భారతాన్వయుఁడు వాసవనందనుఁ డర్జునాఖ్యుఁ డే
తెంచఁ గలం డతండు కడతేర్చు మిముల్ దృఢసాహసంబునన్. 63

క. చనుఁ డచటికి నిపు డింపెన, యా 'దుఃఖం పంచభిస్సహ' యనంగా మున్
విని యుండురె కద యేటికి, మనమున సమ్మలికఁ జెంద మదవతులారా. 64

శా. అంచున్ మమ్ముల నూఱడించ వినయాహ్లాదంబు లెంతే విజృం
భించన్ మ్రొక్కి జగంబులందును మిముం బేర్కొన్నమాత్రిం బటా
పంచం బై దురితంబు లెల్లఁ జనఁ గా భక్తిన్ మిము న్నేఁడు ద
ర్శించన్ క్షేమము వోయి మోదము మదిం జెన్నారదా నారదా. 65

తే. ద్వారకాపుర మచటికిఁ జేరవచ్చుఁ, జెప్పఁగా విని కడుసంతసిల్లి కలదు
గా యిఁక సుభద్రరూపరేఖావిలాస, విభ్రమంబులు గనుఁ జూడ్కి విందుగాఁగ

క. అరచందమామ నేలిక, దొరఁగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్
బరువంపు మొల్లమొగ్గల, దొరగాఁ బల్కుఱుదు బల్కుఱుదు జవ్వనికిన్. 78

క. అలకలు నీలము లధరం, బలపగడము గోళ్ళు మౌక్తికంబు లటంచున్
దెలుప మును విందుఁ జిలుకల, కొలికి తెఱంగెల్లఁ బూస గ్రుచ్చినరీతిన్. 79

తే. అనుచు నాకన్యఁ గైకొను నాసఁ దగిలి, యతులకు విధేయుఁ డగుచుఁ యాదవులని
తను నెఱుఁగకుండవలె నన్యులనియు దలఁచి, యనుచరజనంబు నంపందపనిచియుండ.

సీ. మృగనాభితిలకంబు బుగబుగ ల్గలలా, టముపై మృగమదార్ఘ్యపుండ్రంబు దీర్చి
తపనీయకాశేయధారేయ మగుకటీ, రమునఁ గాషాయవస్త్రము ధరించి
శరణాగతాభయసంజాయకం బైన, దక్షిణపాణిఁ ద్రిదండ మూని
రణచండకోదండగుణకిణాంకం బైన, డాకేల నుసఁగమడలువు దాల్చి
తే. యుండెఁ బో శాంతిరస మెల్ల నట్టిపడఁగ, నగలపొందు రోసి సన్న్యాసియగుట
గద యుచిత మెందు నానవమదనమూర్తి, యగనామణిఁ గోరి సన్న్యాసి యయ్యె.

క. ఇటులుండి తనదుకోరిక, ఘటియించు హలాయుధుండు గాఁ డనుకూలుం
డటులైన నేమి యనుటన, ఘటనాచతురుండు గలఁడ కా హరి యనుచున్. 82

క. గోపాలన దక్షుం డా, గోపాలకచక్రవర్తి కోమలదివ్య
శ్రీపాదపద్మములు దన, లోపలఁ దలపోయ నంతలోపల వేగన్. 83

ఉ. సొన్నపుసన్నచేలఁ గటిఁజుట్టి కిరీటము మౌళిఁ దాల్చి రె
మ్మన్నియతోడఁ బుట్టు నెనుమానిక మక్కునఁ జేర్చి వచ్చి చెం
త న్నిలిచెన్ దయారస మెదం బొదువన్ యదువంశదుగ్ధవా
రాన్నిధిపూర్ణిమావిశదరశ్మిదరస్మితచారువక్త్రుఁడై. 84

ఉ. అప్పుడు సామి దాఁ దలఁచినంతనె వచ్చె నటంచు విస్మయం
బుప్పతిలంగ వేడ్క నవలోత్తరఁగ గన్నుల హర్షబాష్పముల్
చిప్పిలఁ గ్రీడిపాదసరసీజములం బ్రణమిల్లి తద్భ్రమల్
రెప్పల నప్పళించుచును లేవక యుండఁగ సంభ్రమంబునన్. 85

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని కూరిమితోఁ గుశలంబు వేఁడి తా
వచ్చినరాక లోఁ దెలసి ద్వారకరైవతకాద్రిపొంతనే
యిచ్చటికిన్ సమీప మని కృష్ణుఁడు దెల్పుచుఁ దోడితేఁ గా
వచ్చె రథంబుపై నపుడు వాసవి వేసవి యేఁగు నంతటన్. 86

తే. వచ్చి రైవతకారామవాటి సల్పి, కృష్ణుఁ డంచిష్టగోష్ఠి సారేయు కడపి
యచట నుండుము తావకాభీష్ట మిపుడు, సేయుదు నటంచుఁ జైత్రృవ్వ సేయునిలిపి
ఉ. ద్వారక కేఁగి యందు బుధవర్గము బంధుజనంబు లాప్తులుం
గోరి భజింప నుండి యొకకొన్ని దినంబులమీఁద భక్తవం
దారుఁడు వాసుదేవుఁడు ముదంబున రైవతకాచలోత్సవ
శ్రీ రచియింపఁగా వలయు రేపని మంత్రులఁ జూచి పల్కినన్. 88
ఉ. అప్పుడె వారుఁ దీర్పరుల నందుల కర్హులఁ బంచి చాలువా
యొప్పులకుప్పలై మెఱయుచుండెడు మేరువులుం గురుంజులున్
జప్పరముల్ వితానములు సర్వము నాయితపెట్టి కానుకల్
దెప్పలుగా సమర్చి రతితీవ్రిత రైవతకాచలంబునన్. 89
చ. అపుడొకమాటఁ గంసరిపుఁ డానతియిచ్చెనొ లేదొ మంచిచొ
క్కపుఁ గపురంబు గిన్నియలు కస్తురిపిండులు రాశిగాఁగఁ గొం
దపాడవు దెచ్చి వైచిరచటన్ మఱి చెక్కినవస్తు లంట్రిమా
యపరిమితంబు లే మనఁగ సర్వభుపట్టణభాగ్యసంపదల్. 90
తే. గంధమాల్యాభరణవస్త్రకలితు లగుచుఁ, గామినీరత్నములు దారుఁ గలసి మెలసి
చనిరి రైవతకోత్సవంబునకు నపుడు, వీరు వారన కయ్యాదునీరువారు. 91
చ. కలశకుచఁ గెందిరికాని ఆవికంబలెఁ గుంకుమఁ బూసి చూడు మో
పాలఁతుక వాడు నే గ్రపినఁ బూసినయట్లనె తెప్పయున్నదే
బలి యని కేళినీరమణి పల్కిన నవ్వుచు శంబరారి య
ర్మిలిఁ గయిసేసి యేఁగిరి గిరింగన నారుచిరాంగు లిర్వురున్. 92
ఉ. రేవతిగుబ్బచంటిమకరీమయరేఖ లురఃస్థలంబునన్
భావజచిహ్నముద్రి లయి భాసిల మేలిమికందుదుప్పటిం
బైవలెవాటు వైచి నునుపైజిగి గందపుఁబూఁతయై తగన్
రైవతకాద్రి కేఁగె బలరాముఁడు కేళికళాభిరాముఁడై. 93
క. నగధరుని వెంట నడిచిరి, మిగులం గైసేసి యటుఁ దమిం గస్తూరీ
భుగభుగలు నుదిరి బంగరు, నిగనిగ నెఱ యందె ఆవలు నెఱయుం దెఱవల్. 94
చ. పురజను లింపునం గనఁగఁ బొంతల రుక్మిణి సత్యభామయుం
దొరయఁగఁ దక్కు నాఱ్వురను దోఁ జన నావెనుకం బదాఱువే
ల్తరుణులు గొల్చిరాఁగఁ బ్రియదంబునఁ గృష్ణుఁడు వట్టివేళ్ళచ
ప్పరములనీడనే యరిగెఁ బట్టిన కానుక లెల్లఁ జూచుచున్. 95

క. ఆగతి నరిగి సమస్తజ, నాగతి రైవతకగిరిమహోమహాలీలా
భోగము గన్నులపండువ, య్యై గాఢకుతూహలంబు నదరం జేయన్. 96

ఉ. మాన్నతిభక్తిఁ బూజలు సమున్నతిఁ దా నొనరించి యాత్మయో
షిన్నికరంబులం బిడప సేవ లొనర్పఁగఁ జేయుచుండె నం
తన్నవరత్న హేమరచితం బగుపల్లకి నెక్కి వేడ్క రా
నన్నలు రామకృష్ణులు రయంబున రమ్మని గారవింపఁగన్. 7

క. చెలియాలు సుభద్రి వచ్చె, న్జెలియలు వేమాఱులు నిరుచెంతలఁ గొలువన్
దొలకరిమెఱపో యిది యని, తొలకరిదొరబిడ్డ వెఱఁగుతోడం జూడన్. 98

ఉ. యాదవచూళికాభరణ మప్పుడు కొందఱు బోట్లు మూఁగలన్
రైవతకోత్సవాగతజనంబు బరాబరి సేయుచుండఁ ద
ద్దేవత కర్చ నాసతు లతిప్రమదంబునఁ జేసెఁ బైపయి
న్దైవతరాజనందను ధనంజయునిం బతిగాఁ దలంచుచున్. 99

తే. ఈకరణిఁ బూజ లొనరించి యిష్టసఖులఁ, గూడి యగ్గిరికందరాకూటతటవి
నోదవైఖరు లెల్లఁ గన్గొనుచు సరస, గోష్ఠి నుండెను పద్మరాగోష్ఠఁ జూచి. 100

క. మును విన్నది తా నప్పుడు, గనుఁగొన్నది యొక్కతీరుగాఁ దాగ్గానై
పెనఁగొన్న మహాశ్చర్యం, బున నన్నరుఁ డిట్టు లనుచుఁ బొగడం దొడఁగెన్. 101

ఉ. చూడమె దేవతాసతుల శోభనకాంతివిలాసవైఖరుల్
చూడమె నాగకన్యకల లోకమనోహరరూపసంపదల్
చూడమె మర్త్యకామినులసోయగముం దమకంబు పెల్లు తీ
పాడఁగ దీనివంటియొఱ పైనమిటారినిఁ జూడ మెందులన్. 102

క. చెక్కులజిగి చనుగుబ్బల, చక్కఁదనము మొగము లేటు జడతీ రౌరా
చొక్క మగుదీనిఁ జూచినఁ, జొక్కమనం గూడ దెట్టిసుజ్ఞానులకున్. 103

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమొగం బవురా తలకట్టుతమ్మిపూ
పున్నమచందమామలకుఁ బొక్కిలి చక్కఁదనంబుఁ జెప్పఁగా
నున్నదె మేలుబంతులు పయోధరముల్ మఱి కాను సున్న యా
వెన్నిక కెక్కువాఁతఫల మిచ్చవర్ణ నికి న్నిజంబుగన్. 104

తే. భ్రమరకమనోహరం బౌటఁ బద్మ మగును
తారకాహృద్య మగుట సుధానిధి యగు
రెంటిజగడాలు మోమున నంటి యుంట
నబ్జముఖి యాంటు లెన్న యాయలరుఁబోఁడి. 105

సీ. ధారాధరము వెన్న దన్ని పుట్టినచాయ, నున్నదిబింబాధరోష్ఠి వేణి
జక్కవకవ బొమ్మ తొఱిక్కి నిల్చినజాడ, నున్న దీనవలాపయోధరములు
చిన్నిప్రాయపులేడిఁ జెవులు వట్టాడించు, గతి నున్న దీరామకన్నుదోయి
నల్లచీమలబారు నడుమ దాఁకినవీఁక, నున్న దీచెలువంపుఁగన్నె యారు
తే. విపులపులినంబు వెక్కసు వీఁగ నొత్తు, నందమున నున్న దీమందయానపిఱుఁదు
దీని కెన యైనలతకూనఁ గాన మౌమ, నోజవజాప్రింగి యీజగన్మోహనాంగి. 106
క. సైకము నడుము విలాసన, సైకము నెమ్మొగము దీనిస్పృహమధురోక్తుల్
పైకముఁ దెగడున్నవలా, పైకములో నెల్ల మేలుబం తిది బళిరా. 107
ఉ. ఇత్తరళాక్షి మేనిజిగి యేలిక మేలికడాని పైఁడి కీ
గుత్తపుగుబ్బలాఁడిజడకూఁకటి చీఁకటిమూలదుంప కీ
పుత్తడిబొమ్మకన్నుఁగవపోలిక వాలికగండుమీల కీ
బిత్తరిముద్దునెమ్మొగము పిన్నమ పున్నమచందమామకున్. 108
తే. కామినీమణినిడువాలుఁగన్నుఁగవకు, నెన్నికకు రానితొగ లౌరు లీడు నేఁత
తగదు తగ దిఁక నలినపత్త్రింబులందు, నీ డగునొ యేమొ మాట వేయింట నొకటి.
క. మహిలో సరి గల దా యీ, మహిలోత్తంసంబు మేనిమహిమఁ దెలియన్
మిహికుంద ప్రసలాకన్, మహికాకరరేఖ మించు మించుకన్ మించుకన్. 110
సీ. కలిగెఁబో యీయింతికులుకుగుబ్బలఁ జూడ, శీతశైలాదులసేవఫలము
కలిగెఁబో యీనాతివళులయందముఁ జూడ, గంగాతరంగముల్ గన్నఫలము
కలిగెఁబో యీరామకనుబొమలు చూడంగ, మును ధనుష్కోటిలో మునుఁగుఫలము
కలిగెఁబో యీభామకటివిలాసముఁ జూడ, భూప్రదక్షిణము సల్పుటకు ఫలము
తే. తోడుతోడనె యిటులు చేకూడవలదె, తన్వి దీఱంగ నింక నీతన్విఁ గూడి
సరససంభోగసల్లాపసరణిఁ దేలు, నాఁడు గా ఫలియించుట నాతపంబు. 111
క. అని కొనియాడుచు నుండన్, వనితామణి నంత నుత్సవము చేసి పురం
బున కన్పుచు మాయాముని, గనుఁగొని యాహాళి నితాంతకౌతూహలియై. 112
తే. అతని నుత్తమయతియకా మతిఁ దలంచి, వినయమునఁ జేరి సాష్టాంగవినతిఁ జేసి
స్వామి లెందుండి యిచటికి వచ్చినారు, తీర్థయాత్రగ నది యెల్లఁ దెల్పుఁడనిన.
క. హిమశైలసేతువులమ, ధ్యమునం గలనదులు నిధులు నాశ్రమములు దీ
ర్థములుం దాఁ గనుఁగొన్నవి, క్రమమునఁ దెలుపం బ్రమోదరసపరవశుఁడై. 114
మ. కలిగెన్ భాగ్యవశంబునం గనుఁగొనంగా మిమ్ము మమ్ముం గృతా
ర్థులఁ గాఁ జేయఁగ నాత్మలోఁ దలఁచి చాతుర్మాస్య మిచ్చోటనే

సలుపగా గా వలె స్వామివా రని నమస్కారంబు గావించి ప్రాం
జలియై వేఁడిన సమ్మతించెఁ గుహానాసన్న్యాసి యుల్లాసియై. 115

తే. చెలువనేత్రవిలాసంబు చెవులు సోఁక, బాలకుచలీల యెదఁ జాలఁ బట్టి కాల్ల
గలికినెఱివేణి చెలఁగంబు కాళ్ళఁ బెనఁగ, నవలఁ బోలేక నిలచె నయ్యర్జునుండు. 116

క. సీరియు నిటులాక్షానా, సీరియు నన్యోన్యసూక్తిసితహాసులై
పౌరానికూర్మి నుండఁగ, నారాముని కడకు వంత హరి సనుదెంచెన్. 117

క. చనుదెంచిన స్వాములకున్, వినయము గావింపు మిచటు వీరల నిలుపుం
డని వార ముపవనంబున, ననిచి మనసుభద్ర సేవ కొనరుపు మన్నన్.118

తే. వయసువారును జక్కనివారు వీరు, మనసుచర్మంబులేమియు మనకుఁ దెలిసి
యున్న యచి గావు సేవకు ననుపఁదగునె, కన్నె నదియేమొ తెలిసికొమ్మన్న నతఁడు.

క. వీరుమహాత్ములు ఘను లప, చారం బగు నిట్టులాడ సంయములకు మున్
గోరిక వెలఁదులఁ గన్యలె, గారా కుమారివ సేయఁ గాఁ దగువారల్. 120

ఉ. నెమ్మది సంశయింప కిది నీవొనరింపు మటన్న నట్లె కా
నిమ్మని యమ్మునిప్రవరుఁ గృష్ణుఁడు దోడ్కొని ద్వారకాపురీ
శమ్మొనరించి యంతిపురిఁ జయ్యనఁ జెల్లెలిఁ బిల్వ నంపి గా
వమ్మ సుభద్ర నీయభిమతార్థము లెల్ల ఫలించు నిమ్మొకన్. 121

శా. కామాదిస్ఫురణంబు లెల్ల నడఁగంగాఁ జేసి ధన్యాత్ములౌ
స్వాముల్ వీరలు వీరికిం బాదవుకేలన్ సేవ గావింపు మెం
తో మోదంబున నానతిచ్చి బలభద్రుండే నియోగించినాఁ
డేమో చెప్పితి నంచు నుండెదవు సుమ్మీ నీమదిన్ సోదరీ. 122

క. అని తత్కన్యాంతఃపుర, వనకుంజలకుంజసంజవనమునఁ గుహానా
ముని నుండఁ జేసి పలికెన్, వెనరు మదిం బొదల రుక్మిణీసత్యాతోన్. 123

క. అతఁ డెవ్వఁ డెఱుఁగుదురె మీ, మతిలోనన యుండ నిందు మనకుందనపుం
బ్రతిమ యగుసుభద్రకు నై, యతివేషముఁ బూని యున్న యర్జునుఁడు సుడీ.

క. తనమదిలో నితఁ డర్జునుఁ, డని తెలిసి సుభద్ర సేవ కరుగక యున్నం
జని మీ రతనికి భోజన, మొనరింతురు గాని యూరకుండెదగ సుడీ. 125

మ. అతనిం బూజ లొనర్పఁ డిప్పు డని నెయ్యంబొప్ప గోపాలుఁ డా
సతి యీ సర్మిలి మొక్కి నిన్నుఁ గని యెన్నాళ్ళొకదా యంచు వ
చ్చితివా యన్న కిరీటి కూర్మి కలదా చెల్లెండ్రపై నంచుఁ ద
త్సతు లేకాంతమునం బ్రియోక్తులను బూజల్ సేసి వీడ్కొల్పినన్. 126

తే. అన్నరుం డంత శ్రీకృష్ణుఁ డున్ననగరి, సరసఁ గన్నియరాణివాసమున నమరు
కేళివనిలోన నవరత్నకీలితంపు, బవిరిడాకులచిన్నియుప్పరిగలోన. 127

తే. తెలివనెఱిఁగంకబొమలును మెఱుఁగువాఁడి, చూపులను జూచి తనచేతిసూటిరోసి
యస్త్రసన్యాస మొనరించినట్టిసుమశ, రాసనుం డనఁ జెలిమిఁదియాస నుండె 128

క. అందుండి మనసులోన ము, కుందుం డీతి నొనర్చుకుశలత కతఁ డా
నందమును జెందుచు డఁగఁ, గొందఱు గారాబుచెలులు గొల్వఁగ నంతన్. 129

ఉ. చందురకావిపావడపిసాళిరుచుల్ పరిగించుఁజీరపైఁ
జిందులు ద్రొక్క వేణి కటిసీమపయి న్నటియింప జాళువా
యందెలు మ్రోయ జంటిఱవికంటి చనుంగవ పిక్కటిల్లఁగాఁ
జందనగంధి వచ్చె రభసమ్మున నమ్మనిరాజు సేవకున్. 130

ఉ. వచ్చిన దానిఁ గాంచి తలవంచి జపంబు నెపంబు వెట్టి వి
వ్వచ్చుఁ డొకింత సేవు తనవంకఁ గనుంగొనకున్న మెల్లనే
యచ్చట నిల్చి నిల్చి వినయంబునఁ జేరి యుదంబు లూరగా
హెచ్చినభక్తి మ్రొక్కి యనియెం జెలి యంజలిఁ జేసి యింపుగన్. 131

ఆ. ఓమహానుభావ యేను గావలె దేవ, పూజకిపుడు పత్త్రిపుష్పఫలజ
లాదికములు దెత్తువా యనవుడు నట్ల, సేయు మనుచు నతఁడు సేయి నూప 132

సీ. తనమారుణాధరంబునకు నీడివి యన్న, రమణ నేఁజిచి పల్లవములు గొన్ని
తనతనూసౌరభంబునకు జోడివి యన్న, చంగాన వెదకి పుష్పములు గొన్ని
తనమధురాలాపములకు దీటివి యన్న, పగిది నారసి తియ్యఁబండ్లు గొన్ని
తనలేఁగవుతేటకును బాటియివి యన్న, పోల్కి దేఁజిచి హిమాంబువులు గొన్ని
తే. పత్త్రిపుటికావిభూపలపాత్రికలను, దెచ్చి వినయంబుతోడ నందిచ్చె నపుడు
పసిఁడిగాజులమిసమిసల్ పైకిఁ బొలయ, జకితబాలమృగీచకచకితనయన. 133

ఉ. గొంటుని పేర్మి మేను పులకించెఁ గిరీటికిఁ బూలొసంగి వా
ల్గంటి గిలుక్కునం దిరుగఁ గమ్మని కస్తురితావి క్రమ్మఁ గ్రొం
గింటెపుగబ్బిగుబ్బలజిగిన్ వెలిఁజిమ్మనొయారిజిల్గుప
య్యంటచెఱం గొకింత దనయంగముపై నటు సోఁకి నంతటన్. 134

క. చేసె జప మతఁడు గడువి, శ్వాసము చెలిచూపుబేడిసలపై నిగుడన్
జేసినయది జపమున్ మఱి, వేసినయది గాల మనుట వృథగా కుండన్. 135

తే భామమోమున వ్రేలురూపంబుఁ జూచి, ముదితయెడఁబాయకుండెను మూర్తిఁ దలఁచి
రమణి మైసగ మైనవిగ్రహము నెంచి, పార్వతిని వేఁడుకొను దేవపూజవేళ. 136

తే. విశతిఁ జేసిన భిక్షు గావింపుఁ డనిన, మాఱుఁ గడ్డింప నివి దెత్తుమా యటన్నఁ
బల్కు నారాయణా యనుభాషణంబె, యాల నిజాలకు సన్యాసివలె నతండు. 137

క. భయభక్తుల నిటు లాకృతి, కయతిగాత్రమణికిఁ గన్యకామణి కుమారి
వ యొసఁర్చుచుఁ గొన్నాళ్లుం,డి యొకనాఁడు తనదుడెందములోనన్. 138

ఉ. వాసవిరూపచిహ్నములవార్తలు మున్ విని యుండుదుం గదా
యాసాబ గల్ల నేఁడు గన నయ్యెడు వీరలయందు నైన స
న్న్యాస మసంగతం బగుచు హానుకుమారుఁడు రాకుమారుఁ డీ
గాసికి నోర్చునే కలరు గా మఱి మానిసిఁ బోలు మానిసుల్. 139

క. అని సంశయ మొకయించుక, యును లే కెప్పటివిధమున యువతికలసం
బనుపుగ నతనికిఁ బూజన, మొనరించుచు నుండె నంతికోద్యానమునన్. 140

సీ. కరము సాఁచి నవాంబుకలశ మీ విడిపడ్డ, కుంకుమాంకపుముద్దుఁజంక మెఱపు
ననలుఁదేఁ బోఁ గాళ్ళఁ బెనఁగు నంచ నదల్పఁ, జూమజంకెనవాఁడిచూపుబెళ్కు
పూరెమ్మ వంచుచో జాఱుపయ్యంట దాఁ, గిలిమూఁతలాడుగుబ్బలబెడంగు
పాలఁతి కాయో పండో పోయినపని యన్నఁ, జిలుకమాటకు నవ్వుసొలపుఁదేట
తే. మఱియు మఱియును జూడనే మనసు వాఱి, వాటికసుమఫలంబులఁ దేరఁ బనుచుఁ
దొలుతటివి చాల వని యానసూలలాము, నే మఱఁగ దచ్చువిద్వమ్ము నేమ మింక.

తే. తెమ్ము బంగారుఁ గుండజలమ్ము లనుచుఁ, దెమ్ము లతకూన నుంచిసుమమ్ము లనుచుఁ
దెమ్ము బాగైనకొమ్మఫలమ్ము లనుచు, మించుఁబోఁడిని నేయు ప్ర మింగఁబలుకు. 142

క. తుమ్మెదవలె నున్నది యిటు, గమ్మని నెఱికొప్పు నివిరి బ్రిమసితిఁ దరుణీ
కమ్మగిరి ల్లగలు వని, క్రొమ్మఱి మఱుసెట్టుగుట్టు గవ రా కుండన్. 142

క. నిద్ద పుమేలిసొమ్ములు, దిద్దికస్తూరిబొట్టు దినదల్పాలు నై
పొద్దోకసింగారముతో, నుద్దియ చను దేర నిగుల మోహాతురుఁ డై. 144

చ. బలిమిని బట్టఁగా డిపురుఁ బట్టి నొప్పక యిట్టటున్నచోఁ
బలుపు రతింగిరేని నగుఁబా టని కొంకుఁ దలఁ పెఱింగకే
కలయఁగఁ జూమటల్ తగవు గా దని యుండు నతఁడు కాంత నె
చ్చెలుల నొకింత పాసి తనచెంత మెలంగుచు నున్న వేళలన్. 145

చ. అటు జగదేకసుందరికి నై యతివేషముఁ బూని వచ్చి నాఁ
డఁట తనచేయుభాగ్యమున నప్పువుఁబోఁడియె చెంత నేవ సే
యుట కని వచ్చియుండు నఁట యొక్కొకపట్టున నొంటిపాటు నా
నఁట యతఁ డెప్పు డెప్పు డను టబ్బురమే మదిఁ దత్తఱించుచున్. 146

ఉ. సుందరి రానిచో నెదురు సూచుచు నుండనె పట్టె వచ్చుచో
నిందునిభాస్యచక్కఁదనమే కని చొక్కుచు నుండఁ బట్టె నీ
సందడిచేతనే యరుగసాగెను బొద్దిఁక వేళ యిప్పుడో
సందె జపంబు నర్చనలు సల్పుట కాకపటుత్రిదండికిన్. 147

తే. వెలఁదికెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ
దరుణికౌఁగౌను గని హరిస్మరణ మఱచెఁ
గడమ యున్న నేల వేయ మొక్కటియె తక్క
మఱచె నన్నియు వాక్పతిత్రిదండి. 148

మ. ఒడలుప్పొంగ నొయారిఁ జూడ జవరాలొద్దన్ మెలంగన్ గను
ర్వొడుచున్ ముద్దులగుమ్మ గంధకుసుమంబుల్ చేతి కందిచ్చు న
ప్పుడు వ్యాపారము లన్నియున్ మఱచు నప్పూఁబోఁణి రాకుండినన్
గడచే నొక్కమహాయుగంబుకరణిన్ గన్పట్టు రామాలికిన్. 149

క. ఆనందబాష్పములచే, నాని వధూహితభావనటునలఁ దనలోఁ
దాన తలపోయువానికి, స్నానం బేమిట్టికి వేఱె జప మేమిట్టికిన్. 150

క. ఈరీతి నుండ నొక నాఁ, డా రాజకుమారి యతని కాహార మిడన్
జేరి తదారామంబునఁ, గూరిమి నెచ్చెలులు వెంటఁ గొని తేరంగన్. 151

క. వెస లలనామణి బంగరు, వెస లల దొంతరలు డించి వినయము మదికిం
బొసఁగఁగఁ గంకణరవములు, బొసఁగఁగ వారసి రసాన్నములు వడ్డింపన్. 152

చ. చిలుకలకొల్కి వే యెదను చేముడి గొల్వెడు జాఱుకొప్పు నిం
పులదుఁకింపు చుందు భుజమూలరుచుల్ జిలుఁగుంబయంటలోఁ
గులుకుమిటారిగబ్బిచనుగుబ్బలుఁ జూచుటె కాని క్రీడి క
ర్మిలి మతి లేదు భోజనము మీఁదియపేక్ష యొకించు కేనియున్. 153

తే. రమణి యొయ్యారములపైఁ బరాకుచేతఁ
జని యెఱుంగఁడు వడ్డించునది యెఱుఁగడు
భోజనము సేసి లేచె నారాజసుతుఁడు
తృప్తి యేరీతి నుండెనో తెలియరాదు. 154

క. అపు డతిరయమునఁ బన్నీ, రపరంజిపసిండిగిండియందుం గొని తాఁ
జపలాక్షి తెచ్చి యొసఁగఁగ, గపటపుసన్న్యాసి ధౌతకరపంకజుఁడై. 155

క. నిగనిగనిచంద్రికాంతపు, జగతిపయిం గూరుచుండ జవ్వని వెనుకన్
బగడపుఁగంబపుఁజాటున, మొగ మించుక గానిపింప మురువు నటింపన్. 156

శా. కంగుల్ దీరఁ బైఠిణీరవిక చక్కట్టంటి రాణింపఁగాఁ
జెంగల్వల్ నెఱికొప్పునందు నొఱపై చెంతం గుబాళింపఁగా
బంగారందియ ముక్కునం గమిచి నైపై సంచ యల్లింపఁగా
సింగారం బగుముద్దుఁ జిల్కతనరున్ జేదోడు వాదోడుగాన్. 157

తే. ఏకతంబున వసియించి యిట్టు లుండ
మదనమదనాగవలమాన మానసాంబు
రుహుఁడు పురుహూతసుతుఁడు నేరుపునఁ బలికె
నా చకోరాక్షిఁ గ్రేఁగంటఁ జూచి యపుడు. 158

తే. చెలువ నిను రాజకీరంబు చెట్టపట్టెఁ, గలికి నిను రాజహంసంబు కాలు ద్రొక్కె
మంచిశకునంబు లివిగో నామాటఁ జూడు, కన్నె యీలోనఁ బెండ్లిగాఁగలదు నీకు

క. అనవుడు లజ్జావనతా, ననతామరస యయి వీరు నాఁగ మహాత్ముల్
తనసేసినసేవకుఁగా, మన మలరి వచించి రనుచు మది నుత్సుకయై. 160

తే. కురులు కెంపులబొగడల నెరయ దువ్వి
నిక్కఁజనుగుబ్బలఁ బయంట చక్కఁ జేర్చి
పలికెఁ గలకంఠి మోమునఁ దెలివి దొలుక
ముత్తియపుముంగఱ యొకింత మోవిఁగదియ. 161

మ. అవుఁగా మీ రిట మున్ను గన్గొననిచాయ ల్లేవుగా నాఁటనుం
డి విశేషంబులు గొన్ని మిమ్ము నడుగన్ వేడ్కయ్యెడు న్నారు నె
య్యవి గన్గొంటిరి పుణ్యభూము లట రాజ్యంబుల్ మనోజ్ఞంబు లె
య్యవి యేయేపురముల్ గనంబడియె మీ కుద్దండ మార్గంబునన్. 162

క. మీరింద్రప్రస్థముఁ గని, నారా పాండవులఁ జూచినారా సుఖులై
వారందఱు నొకచో నున్నారా వీరాగ్రగణ్య నరు నెఱుఁగుదురా. 163

సీ. ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు, పుడికిపుచ్చుకొను నెన్నడుమువాఁడు
నెఱివెండ్రుకలవాఁడు నీలంపునికరంపు, మెఱుఁగుఁజామనచాయ మేనివాఁడు
గొప్పకన్నులవాఁడు కోదండగుణకిణాంకము లైనముంజేతు లమరువాఁడు
బవిరిగడ్డమువాఁడు పన్నిదం బిడి డాఁగ,వచ్చు నందపువెన్ను మచ్చవాఁడు
తే. గరగరనివాఁడు నవ్వుమొగంబువాఁడు, చూడఁ గలవాఁడు మేలైనసొబగువాఁడు
వావి మేనత్తకొడుకు గావలయు నాకు, నర్జునుండు పరాక్రమోపార్జునుండు. 164

క. తడ వాయె భూప్రదక్షిణ, మడరింపఁగఁబోయి యామహామహుఁడు పదం
పడి పుణ్యస్థలముల నె, న్నఁడు మీ రందందు నరుగ నరుఁ గానరు గా. 165

క. అన విని సమస్తభూములు, గనినారము తీర్థయాత్ర గావించునెడన్
గనుఁగొనినారము సంక్రందననందను ననిన ముద మెదం జెన్నొందన్. 166

ఉ. ఎచ్చటఁ గంటిరో విజయు నిక్కువ నిక్కువ మానె రాఁడుగా
యిచ్చటి కంచుఁ గోరికలు నీరిక లెత్తఁ దనోక్తిఁ బల్కఁగా
వచ్చెను లేనిబీర మెద నూరఁగ నూరఁగ సాగ వెంటనే
పచ్చనివింటివాఁ డపుడు పైఁదలిపైఁ దలిరాకుఁగ్రొదువుల్. 167

ఉ. కోమలి యాగతి న్మదిఁ దగుల్పడఁ బల్కఁ నన్వ నిర్జర
గ్రామణిసూను మీ రెచటఁ గంటిరొ యంటివి కన్నమాత్రమే
యే మని చెప్పవచ్చు నొకయించుక భేదము లేక యాయనే
మే మయి యున్నవారమునుమీ వికచాంబుజపత్త్రలోచనా. 168

ఆ. తీర్థములను గ్రుంకి దేవతాసేవలు, చేసికొనుచుఁ బెక్కువాసరములు
గూడి యతఁడు మేము గోకర్ణమునయందు, నుంటి మనిన మచ్చెకంటి యలరి. 169

క. ఎక్కడ గోకర్ణం బన, నిక్కడి కది యెంతదూర మింతకు నతఁ డీ
చక్కటికి వచ్చునో లే, కక్కడనే యుండి యవలి కరుగునొ చెప్పుఁడా. 170

క. అని రాజవదన మాటికి, ననురాగము తేటపడఁగ నాడెడుమాటల్
విని జేజేరాకొమరుఁడు, వనజేక్షణ కనియె వలపు వడ్డికిఁ బాఱన్. 171

క. వేమాఱు గ్రుచ్చి గ్రుచ్చివు, డే మీ వడిగెదవు మన సొకించుక నీ కా
భూమీశుమీఁదఁ గలదో, తామరసదళాక్షి నాకు దాఁపక చెప్పుమా. 172

ఉ. అక్కఱతోడ మంతనమునం దిటు వేఁడెదు గాన సెంతయున్
నిక్కము గాఁగఁ దెల్పఁ దగు నీ కటు లైన సురేంద్రసూతి యీ
దిక్కున నున్నవాఁ డనుచుఁ దెల్పినతోడనె మాటలాడకే
యెక్కడఁ బోదువో యని యొకించుక సంశయ మయ్యెడుం జెలీ. 173

క. ఆకవ్వడి యతివేషముఁ, జేకొని యున్నాఁడు నీకుఁ జెంతనె యెన్నా
ళ్ళో కలదు వచ్చి యింకను, నీకలక మించు కైన ని వెఱుఁగవుగా. 174

క. నీకై తపంబుఁ జేసెద, నీకైవడి దాఁప నేల యే నర్జునుఁడన్
లోకోత్తరశుభలగ్నం, బో కోమలి నేఁడు గోర్కు లొడఁగూర్పఁగదే. 175

ఉ. నా విని యావినీలకచ నవ్వుమొగం బటు గొంత వంచి యెం
తే వెఱ నివ్వెఱన్ మునిఁగి యీతనిఁ బార్థునిఁ గా నొకింత మున్
భావమునం దలంచియును నమ్మక యమ్మకచెల్ల యీరకే
సేవ లొనర్చు చుంటి నని సిగ్గున దిగ్గన లేచి పోవఁగన్. 176

తే. ఏల పోయెదు నిలు నిలు బాల యనుచుఁ
జిఱునగవు నెమ్మొగంబునఁ జెంగలింపఁ
దమకమున లేచి మఱలేచి తత్కరాంబు
జం బొడిసి పట్టెఁ జే సాఁచి సవ్యసాచి. 177

క. పట్టినమాత్రనె దేవకి, పట్టిక రాజ్ఞము లలాట పట్టిక చెమటన్
వెట్టె గగుర్పొడిచెం జను, కట్టాకయిసుచుంతి వీడెఁ గట్టుంగొంగున్. 178

క. మఱి యపుడు బేసితూపులు, ధరియించియు నేమి చెప్పఁ దరుణి స్మరునిన్
సరికోలలఁ బడ నేసెన్, గొరవంక రొదల్ చెలంగఁ గ్రొన్ననవింటిన్. 179

క. ఆరీతిం జేపట్టిన, రారోనాన్ వేఁదిమీఁదికై రాఁ దిగువన్
దూరము వెస నరుగక యె, య్యారముగా నమ్రవదన యై యుండంగన్. 180

క. ఏ మును చూచి యెఱుఁగ నిను, నీ మును నను జూచి యెఱుఁగ వీవును నిపుడీ
ప్రేమలు వినుకలి నేవై, పై మన కిర్వురకుఁ బర్వెఁ బర్వేందుముఖీ. 181

ఉ. శారికపోరి కంకణము సద్దున గంటుట గాదు కేలు మం
జీరఝుళంఝుళధ్వనికిఁ జేయుట గాదు పదంబు లందవా
గ్ధోరణిమాధురీమహిమకున్ శుక మానుట గాదు చెక్కులో
సారసగంధి నాకొఱకు సారెకు వేఁడెదు జాడ లన్నియున్. 182

క. చిలుకలకొలి కిది నాతోఁ, బలుకంగాఁ గొంత సిగ్గుపడియెదు ముంజే
చిలుకా నీతో నైనను, బలుకంగా రాదె పలుకు బంగారఁటవే. 183

మ. రతికిన్ భారతికిన్ వినోదకథలం బ్రాగల్భ్యమున్ జూపి త
త్పతులం గూరిచి మాటువాసిఁ గను పెద్దల్ గారె మీవారలా
చతురత్వం బిటఁ గొంత గాఁ బడ నీచంద్రాననన్ గూర్చి నన్
బ్రతికింపం గదె ముద్దుఁగీరమ సుధాబంధూభవద్గీఃక్రమా. 184

ఉ. చంపకగంధి మోవి సరసం బగుబింబ మటంచు పట్టితే
లింపు చెలుంగుతోఁ దమి దలిర్పఁగఁ బల్కినఁ జెక్కుగీఁటి ని
న్నింపున ముద్దువెట్టుకొని యెన్నఁడు మన్నన సేయ నున్నదో
పెంపుడుఁ జిల్క నిన్ను దనిపింతుఁ జుమీ చెలి నన్ను గేలిఁకన్. 185

క. అని కేళిశుకమునకుఁ బలికిన, మన మలరం గలికి పలికె మాటలతియ్యం
దనమింతంతనఁ గూడని, తనయధరసుధాసమగ్రితం దెలుపంగన్. 186

తే. మేరలా యివి మీయంతవారలకును, బెద్ద లున్నా రెఱిఁగి వారె పెండ్లి సేయఁ
గలరు వేగిరపాటింత వల దటంచు, విన్నపము సేయరాదె యోచిన్నిచిలుక. 187

తే. అని యుచితరీతి వెలయఁగ నాడు నాతి, రసికముద్రికు మిగులమానసముగరఁగ
నైపుణిం జేసి యగ్గలం బై పెనంగ, నవ్వుమాటి నొడంబడ నమఁ గిరీటి. 188

క. మీవా రెఱుఁగుట యెన్నఁడు, గావించుట యెన్నఁడిఁకఁ గళ్యాణంబుల్
నీవేల జపు వడవెను, రావే మాటాడ కిందు రాకేందుముఖీ 189

సీ. నన్ను గాంధర్వంబునను బెండ్లి యాడవే, సిగ్గేల పడియెదే చిగురుఁబోణి
రతిఁదేల్చి మదనసామ్రాజ్య మేలింపవే, తల యేల వంచెదే జలజగంధి
చెలులు వచ్చెదరు నాతలఁపు లీడేర్చవే, తడ వేల చేసెదే ధవళనయన
మది నిచ్చగించి నామనవి యాలింపవే, కడ కేల పోయెదే కంబుకంఠి

తే. మనసు దాపంగ నేటికే యనుపమాంగి, చలము సాధింప నేటికే చంద్రవదన
మాఱుమాటాడ వేటికే మధురవాణి, చింత సేయఁగ నేటికే దంతిగమన. 190

క. గబ్బిపురం డొంటవెఱుఁగక, గొబ్బునఁ జైఁ బడుగు నీవు గూడనివార్తల్
సుబ్బినఁ గార్యం బెక్కుడఁ, దబ్బిబ్బొ కాక పూర్వతనబిబ్బోకా. 191

క. మీఁదట వియోగసాగర, మీఁదఁగఁ గలవా లతాంగి యే మెఱుఁగ వయో
ద్యూహ్యా సా డన్నను మదనుఁడు, కోఁదా డనువాఁడు బిగువు కొనసాగునొకో. 192

క ఏలే యాలేఖ్యాకృతి, యేలే ప్రాలేయకరముఖీ చూడ వయో
యేలే శైలేయ స్తని, యేలే బాలేందునిటల యే లాఁతిఁ నే. 193

సీ. ఆహార మిం పొకచా గ్రామాఁక యున్న, నాహార మింకఁ గా దబ్జవదన
చెఱకుఁబా లాదవు వాతెఱ యీనిచోఁ గంతు, చెఱకుఁ బాలాదునే చిగురుఁబోణి
కళలు దేరెడు నెమ్మొగంబు ముద్దిడ కున్నఁ, గళలుదేరవు సుమీ కంబుకంఠి
వలకేల నిదురమున నలరింప కున్నఁ, వ్వాల రే నిదుర రాదు కలువకంటి

తే. నేఁడు గాదు గదే ప్రేమ నీకు నాకు, నాటి యున్నది మదిఁ జిన్న నాఁటినుండి
యిటుల నేకాంతసమయ మెన్నఁటికి దొరకు, నేల తప్పించుకొనియెదవే లతాంగి.

మ. అని బాహాపరిరంభసంభ్రమరసాయ త్తైకచిత్తంబుఁ గ
దను వీక్షింప నెఱింగి యందియలమ్రోఁతల్ గేకినుల్ రా సఖీ
జను లేతెంచి రటంచు వే మెఱుఁగి హస్తంబుల్ విడం జేసి నే
ర్పునఁ దప్పించుక పోవ భూవరుఁ డపుం బూఁబోణికిం గ్రమ్మఱన్. 195

క. కలహంస కేకి శుకములు, పికపిల నేతేర నీవు పెంచిన వనిగా
తలఁచెదవు మరుఁడు పైఁ గా, వలిఁ జెట్టిఁ జెఱఁగి తిరుగు వనజాతముఖీ. 196

క. వెలిదమ్మికలుఁ దొలఁకుల, యెలదెమ్మెర లోలయు వాని నెగఁ బోయుచు నో
చెలి జుమ్మని విరహులకుం, దలదిమ్ము ఘటించుఁ దుమ్మెదలది మ్మిచటన్. 197

సీ. కలకంఠి నీకటాక్షము గల్గ నిన్నాళ్ళు, మరుశిలీముఖము పరువు సేయు
వతివనీయాభిముఖ్యము గల్గ నిన్నాళ్ళు, చందమామ నొకింత సడ్డ సేయు
రమణి నీప్రియవచనము గల్గ నిన్నాళ్ళు, కలికి రాచిలుక లక్ష్యంబు సేయుఁ
గొమ నీకరవాలంబము గల్గ నిన్నాళ్ళు, లేమావిచిగురాకు లెక్క సేయుఁ
తే. జూడక మొగంబు ద్రిప్పి మాటాడ విపుడు, చేదిగిచి పట్టుక పరాకు చేసె నిపుడె
యేమి పుట్టునొ కైలాట మింక మీఁద, మగువ దయ లేక విడనాడెఁ దగునె నీకు.
క. మొక మెఱుక కలదు గదవే, మకరాంకునియమ్ముఁగు మేనమామకు నీకుం
దికమకలు సేయ వలదను, మకటా మేడపయి కేఁగువఫుడైన చెలీ. 199
వ. అని యనేకప్రకారంబులం దనమనోరాగంబు తేటపడం బలికినఁ జెలుల నెఱ
యు వెపంబునం బరాకు చేసికొని చిఱుచెమట క్రిమ్మ్రనె మొగంబు మకరందబిందు
కందళితారవిందంబుచందంబునం దనర వరవీణఁ దచ్చిళ్ళ నెత్తి చెక్కుచు నొక్కిం
త లాఱుపయిల్లంటఁ జక్కం జేర్చుచు నొక్కింత వదలు వేనలి నలవరించుచుఁ గొం
డొక చెదరుపాపటఁ గుమ్మకొల్పుచుఁ జక్కఁగిల్లు డెక్కడ వెన్నాడునో యను
భయంబునం బోలె నించుకించుక తిరిగి చూచుచు ననుగత కేకిహంసంబులపై వె
గటుగం బోలెఁ జలించుచు నియ్యెళపు పకియలకుం జెప్పకుమని గాచిల్కకుఁ బ్రియం
బు సెప్పుచు మగతేటి యంత్రిమాటలి ప్రియూహకలకపోలిక నరవిబాగుతో నోలికప్పు
రంపుటనంటుల నంటుదాప్రకుపందిరుల తెరువులఁ బూచేనె కాలువలు దాఁటి చెంగ
లువబావులడగ్గఱ కుంకుమవీటికేళాభూలి నొక్కట్టి వట్టివేళ్ళ కప్పురంబులనీడ క్రీడా
భరం బీడిచికొని పోవ నివ్వసంబున. 200
క. ఆఘమునిఁ బాసి మఱి జీ, రాఘోషము మెఱుగు నరిగె నతఃపురికిన్
వేఘనజఘనకలుక్కఁ, మేఘము నెడఁబాసి పొవు మెఱుపో యనఁగన్. 201
క. ఎటువంటి నేర్పరి నిశా, విటువల్లుకు నడుమ నిల్పి వెడసింగిణిచే
నటు చూపిటు నిటు చూపటుఁ, బటుగతి నుఱు సేసె వానుభ రాజ్ఞకులన్. 2 2
తే కోప మగువారి బెదరించి కూర్పనేర్చు, గూడనుగారిఁ దమిగొల్పికూర్పనేర్చు
గొమ్మలకుమగలకుఁ బెడ్లి గూర్పనేర్చు, జగతి నెంతటి యుపకారి శంబరారి. 203

— ఆశ్వాసాంతము —

శా. దాక్షిణ్యాకరమూర్తి షోడశమహాదానాదిపుణ్యక్రియా
దాక్షా యాశ్రితదీనగతుణకళాధౌరంధరీపత్కృపా
వీక్షా శాశ్వతకీర్తిసైభవరమాభ్రుచ్చోళ సింహాసనా
ధ్యక్షా దుర్గమరాట్కిరీటదళనైకాక్షేమకా. 204

క. కలహారంభణకాతుర, హాలపులకితభుజపరాక్రమార్జితధారా
జలమగ్నఘనీమగ్న, స్థలదుర్గాహార్య దుర్గసామ్రాజ్యనిధీ. 205

భుజంగప్రయాతము. అరాతిక్షయామోఘవృష్టిప్రదాంచత్కృపాణా
నరాధీశ్వరాకార నాళీకబాణా
స్థిరానందసారామ సేవాధురీణా
విరాజచ్చతుష్షష్టివిద్యాధురీణా. 206

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధప్రసిద్ధసారస్వతసుధాసారజనిత
యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయ ధురీణ సకల
కళాప్రవీణామ్యతేంద్ర రఘునాథ భూపాలదత్త హస్త ముక్తా
కటకవిరాజమానవేంకట కవిరాజ ప్రణీతంబైన విజయ
విలాసంబను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.







శ్రీ

# విజయవిలాసము.



## తృతీయాశ్వాసము.



శ్రీధుర్యశౌర్యధైర్య
క్ష్మాధరమార్గస్థ్య గాంభీర్యోదార వి
ద్యాదికవితరణదీక్షా
రాధాసుత యచ్యుతేంద్ర రఘునాథనృపా. 1

తే. అవధరి పుణ్యకథాకర్ణనాతివేల, వార్షులైనట్టిదివ్యమహర్షులకును
తతసమస్తపురాణకథాశతాంగ, సూతుఁ డై విలసిల్లిన సూతుఁ డనియె. 2

క. ఆరీతి నంతిపురమున, నారీతిలకము సఖీజనంబులు గొలువం
జేరినపిమ్మట మదిలోఁ, గూరిమిపిమ్మట విరాళిఁ గొని వరుఁ డుండెన్. 3

తే. కృష్ణుపనుపున రుక్మిణీకీరవాణి, వచ్చి భోజన మిడఁ దల వంచి యగ్గ
లంబయిన చింత వలసి యొల్లమి నతఁడు, సాగటులను బోయి కసిగాటులుగ భుజించె.

తే. మునుపు సైఁపదు సంతోషమున భుజింప, వెనుక సైఁపదు చింతచేతను భుజింప
బాలకుఁడ నున్నయపు డెడఁబాసి యుండు, నొక్కఁడే తీరయ్య భరతవంశోత్తమునకు. 5

ఉ. ఎక్కడఁ జప్పుడైనఁ దరలేక్షణ వచ్చె నటంచు లేచు నే
దిక్కున నల్కుడైన సుదతీమణి పల్కెనని యాలకించు నే
చక్కఁ దళుక్కుమన్న నలజవ్వని మై సిరి యంచుఁ జూచు న
వ్వక్క కిరీటిమోహరసమగ్రత నే ననవచ్చు నయ్యెడన్. 6

ఉ. చక్కఁగఁ గెంపుమోవిఁ గని సారెకుఁ జిల్క మొగంబు వేఁడఁగాఁ
జొక్కపుఁ జిల్వకప్పుజడఁ జూచి మయూరము లబ్బు సాఁపఁగాఁ
జక్కనితమ్మిపూ వడుగుజాడలఁ గన్గొని రాజహంసముల్
తొక్కుడుపాటు చెందఁగ వధూమణి వచ్చుట లెమ నెమ్మదిన్. 7

తే. మారుతమ్ములవాడికి మలయకూట, మారుతమ్ములవేఁడికి మట్టుమీఱు
చంద్రికిరణమ్ములకు శుకశారికాళి, చంద్రికిరణమ్ములకుఁ జాల జలదరించు. 8

చ. విరహిణులం గలంపఁ గలవీరులు వీ రని తమ్ముఁ జేర న
య్యురుకుచవాలుఁజూపులకు నోడుట నంకము గాఁగ మీనముల్

హారిణమునట్లు నే తమశరాంశులు నోడెనొ కాక బాలికన్
గరఁపఁగ రాదె యేల ననుఁ గాఁచెద రీచక్రైణలాంఛనుల్. 9

క. ఇన్నాళ్ళు సేవ సేయుచు, నున్నదియుం బోయె నే డనో కౌఁగిలి యి
మ్మన్నంతఁ జదువఁ బెట్టఁగ, నున్నమతియుఁ బోయె నను టుహో నిజ మయ్యెన్.

తే. అంతిపురమున కరుగుచో నింతి తిరిగి, చూరగాఁ జూచు మనపుకు శృంగారరస మ
పారముగ నుబ్బ జాలెత్తె నారదాని, చలమనోహరలోచనాంచలము చెలువు. 11

సీ. అద్భుతం బను నేనె యని తెల్పినంతనే, మిట్టిమీనై పడె మెలఁతచూపు
గాంధర్వమునఁ బెండ్లి కమ్మనుమంతనే, పచ్చకప్పూర మయ్యె భామపలుకు
బలిమిమైఁ బట్టఁగఁ దలకొనువంతనే, యొకబంతి కల్లయ్యె నువిదపిఱుఁదు
సొలపుఁబయ్యెదఁ దేటి చూతు నన్నంతనే, పచ్చపూసామెఁబో పడఁతియూరు

తే. పేరు వివరించి నే నేల బేల నైతిఁ, గోర్కి యెఱిఁగించి నే నేల గోల నైతి
బలిమిఁ బైఁ బడి నే నేల బయటఁ బడితి, బత్తి గనిపించి నే నేల పలుచనైతి.

సీ. తెఱవ కస్తురిచుక్క దీర్చి వచ్చిన బెళ్కు, గీఱునామము నాఁటితీరు గేరుఁ
దన్వంగి వలిపంబుఁ దాల్చి వచ్చిన ఠీవి, వన్నె గట్టిన నాఁటి చెన్నుఁ దన్ను
వాల్గంటి కీల్గంటు వైచి వచ్చిన చెల్వు, జడ యల్లుకొను నాఁటిసవురు జౌర
వొయ్యారిమెఱుఁగుసొమ్మూని వచ్చిన నీటు, మణిభూషలిడు నాఁటిమట్టుఁ దిట్టు

తే. నాతి రాయంచగుమిగూడి నడచు మురువు
చెలులు గొల్వంగఁ జను నాఁటి సొలపు నలఁపుఁ
జక్కఁదనముల పోఁడి వైనచంద్రముఖికి
నిచ్చలపురూపు లైసైనన నింపు నింపు. 13

ఉ. మిక్కిలి తేఁటిమాడ మిఱుమిట్టులు గొల్పఁ జరించునప్పు డ
మ్మక్క దళుక్కన న్మెఱసిన ట్లగు నే మన వచ్చు నద్దిరా
చొక్కపుఁ బైఁడిబొమ్మ తనుమున్ జవ లాడిన నాడి రింతె కా
కెక్కడి దోయి పో యలమ్ప గేక్షణ మేనికి నక్కడానికిన్. 14

ఉ. చిత్తజుఁ డగ్గి తూపు మొన చేసినఁ జేయఁగ నిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్త నిమ్ము వచియించెదఁ గగ్గనమాట గట్టిగా
వత్తరళాయతేక్షణకటాక్షవిలాసరసప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకుం దలమున్కలు గంగ మీలకున్. 15

క. అని తాల్మిఁ బాయు నేకను, నని యెప్పటివలెనె తిరిగి యరుదేర దొకో
యని యాస సేయు వచ్చిన, నన్నుతోదరి నింక విభుడ నని తలపోయున్. 16

సీ. విరహాగ్ని కోర్వక విధి దూఱుకొనెడు తాఁ, దపసివేషం బేల దాల్చినాఁడు
కడలేని సెకలఁ గందెడుఘనోదకమువేళఁ, దెలిసియుఁ దా నేల వలచినాఁడు
శుకశారికార్భటులకుఁ దల్లడిలెడుతాఁ, నుపవనంబున నేల యుండినాఁడు
కరగతస్వము వోవుకరణిఁ జింతిలెడుతాఁ, వెలఁది నేఁటికిఁ బట్టి విడిచినాఁడు
తే. నేరముల నెంచెద మటన్న నేరికైనఁ, గలవు పరికించి చూడ నందులకు నేమి
యంగసాంగత్యపారవశ్యమునఁ గాక, యెఱిఁగి యుండి నతఁడు చేయేల విడుచు.
తే. ఉనికి శృంగారవన మఁట యొంటిఁ దగిలె
నఁట విరహి యంట యెంత సేయఁడు కిరీటి
నసమశరుఁ డింకఁ దనవైరి యగులలాట
లోచనుని గెల్వ ననిదయఁ గాచెఁ గాక. 18
క. ఇటు లాతఁ డుండఁగా న, క్కుటిలాలక యంత నచటఁ గుసుమశరార్తిన్
బెటిలి పసిఁడి పొన్నపై, ట్టిటు వడి తనలోనఁ దానె యేకాంతమునన్. 19
క. ఏఁ గోరినచెలువుఁడె నను, దాఁ గావలె నంచు వచ్చి దగ్గఱె వేఁడం
గౌఁగిలి యీ కిట వచ్చితి, నౌఁ గా దని పెనఁగి యెంత యవివేక మహో. 20
ఉ. డిగ్గన లేచి నన్నతఁ డతిప్రియదంబునఁ జందమామ తా
నిగ్గుతరంగుమీఁదికయి నెమ్మిఁ గరాబ్జము వట్టి యీడ్చినన్
బిగ్గఁ గవుంగిలించి సుఖసిద్ధిఁ దేలఁగ నీక నా కయో
సిగ్గను పేర వెంటఁ బడఁ జెల్లునొకో ప్రతిబంధ మయ్యెడన్. 21
క. తొల్లిట్టివలె సేవరుఁ బోఁ, జెల్లునె మావారు పెండ్లి సేసెద రిదిగో
నెల్లిఁ దమ కంచుఁ బలికితి, నెల్లిద మగుఁ గాదె తిరిగి యేఁ బైకొన్నన్. 22
సీ. ననుఁ దా వలచిపడ్డనలువల్ దీరంగఁ, గైసేయ నెన్నఁడు గలుగునొక్కొ
పెనఁగి చే విడిపించుకొనిన నేరమి పోవఁ, గెలన నెన్నఁడు నిల్వఁ గలుగునొక్కొ
ప్రియ మెఱుంగక యడ్డపెట్టుతుందుడుకు వోఁ, గల్యాణ మెన్నఁడు గలుగునొక్కొ
మోహతాపము దీఱ మోవిచక్కెరపానకము నెన్నఁడు దేల్పఁ గలుగునొక్కొ
తే. యొంటి శృంగారవనములో నునిచి వచ్చి, నట్టి నెంజిలియెల్ల నేఁ జాఁపపాల
తిలరుఁ జేర్పంగ నెన్నఁడు గలుగునొక్కొ, యాముకాసినరుచకుంభసీమయందు.
క. అని యెంచరానికోర్కులు, మనమునఁ దలపోసి భావమగ్నతచేతం
గనుమూయఁ గలసినట్టులు, గని సంతస మందుఁ దెలిసి కళవళ మందున్. 24
సీ. ఉదయాద్రిరుంగలి నొరసి మీఁద వెలుఁగు, జలజారి వేఁడివెన్నెలలు గాయ
పారుకంటిసెగ కోర్చి యాటి తేటినమారుఁ, డరుఁ జిచ్చుఱవాఁడిములుకు లేయ

బాముకోలతోడ సాము చేసినగాడ్పు, విసపుఁదిత్తి సోఁకి వెగటు చూపఁ
గాత్రిఁ జాచలము పోటుగంటి దూఱ రాజహంసము ల్వడి వాళ్వాళులు సేయ
తే. వేగుఁదఱచు కలవంత వేఁగుఁ జెంత, నంతిపురమున బ్రమదవనాంతరమునఁ
'కృష్ణకృష్ణా!' యటంచు నాకీరవాణి 'రామరామా!' యటంచు నారాజసుతుఁడు.
క. చెలులు పరిసంగవశమ్మున, నలరెం గన విజయభవన మనిన న్నవలా
దెలియ వినుం గలయుం గనుం, బలుమఱు బాగా గిరీటిపచ్చ లటన్నన్. 26
క. మనమున నున్నది మొగమునఁ, గనిపించుం గాన గట్టిగా మదిలోన
న్ఘనభావ మునికి నప్పుడ, ఘనభావము మొగమునందు సుదతికి నిల్చెన్. 27
సీ. పులకించె మే నేమి తలఁచుకొంటివె యంచు, మేలంబు పచరించె మిత్రవింద
యిన్నాళ్ళవలె మన సిచ్చి మాటాడవే, యెందు దృష్టి యని కాళింది దెగడెఁ
జెలి పెండ్లికతఁ జెప్పఁ జెవి యొగ్గి వినవేమి, కలదు లే యని గేలి సలిపె భద్ర
వలపువాసన మించెఁ గలికి నీ మొగమంచుఁ, దరిస్త్రరి నెఱపె సుదంతి కొంత
తే. జాంబవతి నవ్వెఁ దత్తణ సరసమాడె, నేలగడు సేసెదరె ముద్దరాలి ననుచుఁ
బలికె రుక్మిణి సత్య కన్గిలిపె నపుడు, చిన్నమఱఁదలి మోహంపుఁ జిన్నె లెఱిఁగి.
క. అంగన యిన్నాళ్ళును ముని, చెంగటికిం బాటిపాటి సేవలు గావిం
పంగాఁ బోదువు నేఁ డటు, తొంగియుఁ జూడవట, యేమి దోసము సేసెన్. 29
ఉ. అక్కట యింక జూడ వేటి కల యచ్చిక బుచ్చిక సేయు నంచలం
జెక్కిలిగొట్టి దేమిటికిఁ జేరఁగ వచ్చి ముద్దుఁ జిల్కలన్
మక్కువ మొగ్గఁబుఁ జూడ కటు ముట్టవు బొమ్మనె దేల బొట్లనో
చక్కెరబొమ్మ నీవెగటుజాడలఁ జూచిన వింత యయ్యెడున్. 30
ఉ. ఎవ్వనిఁ జూచి మేలుపడితే యరవిందదళాక్షి నీమనం
బెవ్వఁడు సొచ్చెఁ జెప్పఁగదవే మదకోకిలవాణి నిన్ను నేఁ
డెవ్వని చెల్వు నీయెదుట నెన్నఁబడెన్ వినతాంగి నేనెఱా
కెవ్వరు నీకుఁ బ్రాణపద మేటికి దాఁచెదవే తలోదరీ. 31
ఉ. తాలసమీరణంబు పయిపాటున నించుక సోఁకినం గడుం
దూలుచు నుండుఁ గానల వినోదప్రసిద్ధుల ముద్దుఁజిల్కపై
వ్రాలినఁ గందుఁ గేలు పువ్వంటిది నీ నునుమేని దేగతిం
దాళు వియో వియోగశిఖి దా నెడలోఁ దలఁకోఁ దలోదరీ. 32
క. అని వారికి వారందఱు, మనమున దోఁచిటు లాడుముచ్చటమాటల్
విని సిగ్గున నయ్యేలజవ్వని యూరక యున్న నపుడ వారలలోనన్. 33

తే. అంత నిచ్చట ద్వారకయందు దేవకీపతీమణి తాను రుక్మిణియుఁ బెండ్లి
పెద్దలై యర్జును సుభద్రఁ బెండ్లికొడుకుఁ, బెండ్లికూఁతురుఁ జేయ నపేక్షఁ జెలఁగి.

ఉ. కట్టిరి మంచిలగ్నమునఁ గంకణముల్ కరపంకజంబులం
బెట్టిరి మేనుల న్నలుఁగు మేలిమృగీమదకుంకుమంబులం
జుట్టిరి కైశికంబుల విశుద్ధవనోహరపుష్పమాలికల్
పట్టిరి పేరఁటాండ్రు ధవళంబులు పాడుచు నల్లభ బుటన్. 76

శా. ఇక్ష్వాకోర్విది యొగ్గఁ గోశవనిలో నిం పొందు సమ్మానవీ
పున్నాగంబుల పెండ్లి సేయవలెఁ బూఁబోండ్లార రారే యటం
ము న్నెన్నుచ్పల్ దగ నొండొరుం బిలిచికొంచున్ సత్యభామాదివి
ద్యున్నేత్రాయణు లప్పు డిర్వురకు విందుల్ సేసి రందందులన్. 77

క. అంతిరాణి పురోహితుఁ డంత వివాహోచితక్రియాకాండం బా
ద్యంతము గావించుటకై, సంతసమునఁ జేరి యున్న సమయమునందున్. 78

క. సంపంగినూనె యంటెన్, శంపాంగి కిరీటి కొకతె చనుదోయి పిసా
లింపం గిల్జడ కట్టి నటి,యింపన్ గిటగిటని కొకతె చలింపన్. 79

క. కలశస్తని మణికంకణ, కలశస్తనినాద మొలయఁ గా నొకతె వడిన్
దలఁ బ్రామి పసిఁడికొప్పెఁ, జలములు చెలు లంది యొసఁగ జలకం బార్చెన్. 80

లయవిభాతి. చెలువ లొసఁగెన్ సరగఁ జెలువ యపు డొకర్తె
కలఁతికన మొప్ప నొకపాలఁతి తడి యొత్తెన్
గొలఁదిగ జవాది నొలవెలఁది తలఁ బూసె నొక
జలరుహాక్షి సిగ్గ కలరుసరి చుట్టెన్
జిలుక మిడిచె న్నిటలఫలకమున నొకర్తె
తెలి నిలువుటద్దమొక చెలి చెలిపె మ్రోలన్
గలయ జవరా లొకతె మణియుజములదె నొక
లలన విసరెన్ సురటి యలసమున కర్తిన్. 81

తే. ఒరగ వేసినసిగ వింత యొఱపుఁ జూచి
బవిరి దిద్దినచెంపలబాగుఁ జూచి
వడి గొలిపి యున్న మీసము బెడఁగుఁ జూచి
యప్పుడు తమలో సుభద్ర నెయ్యంపుఁ జెలులు. 82

క. వాసవి త్రిదండివేషము, వేసి గదా మేలు సేసె విస జన్నిదమే
వేసికొనవచ్చు నీసిగ, వేసికొనం గూడ దొండు వేసము లైనన్. 83

నడచి వచ్చిరి హరిపురందరులు మ్రోల
సంభ్రమంబున మందహాసము దొలంక. 102

చ. అనిమిషభావ మీసమయమందు ఫలించె నటంచుఁ గోరికల్
వెనుకొనఁ బైనపైన పడి వే తటుకాపడి యూర్వశీనిలా
సిని మొద లైనయచ్చరలు చెంతలఁ జేరి సహస్రదృక్తనూ
జుని మొద లెల్లఁ గన్నులకుఁ జూచిరి మానసముల్ గరంగఁగన్. 103

ఉ. దేవకియింట నుండి యిటు దీర్ణతఁ బెండిలిమూఁకతో రుక్మభో
జావనిజానిజానిజగృహాంగణసీమకు నేఁగి యెంతయున్
ఠీవి ఘటిల్ల సాత్యకి వడిం గయిలా గొసఁగం గిరీటి నై
రావతిమున్ డిగెన్ ద్విజపురంధ్రులు ముత్తెపుసేసఁ జల్లఁగన్. 104

తే. నరవరోత్తముఁ డటు ఘనోత్తరముగాఁగఁ, గుడిపదముమున్నగా నిడి కడపదాఁటి
యారతు లొసంగ దీపకళావళి ల్లి, మోదమున నేఁగెఁ గల్యాణవేదికడకు. 105

శా. శ్రీరంజిల్లఁ బసిండి పెండ్లిచవికం జేరంగ నవ్వేళఁ గ
న్యారత్నంబును దోడి తెచ్చిరి జనానందంబుగాఁ బాడుచున్
పేరంటాం డ్రిరుమంత్రివర్గపరనారీన్ గర్గుఁడున్ దేవతా
పౌరోహిత్యధురంధరుండు శుభమొప్పన్ మ్రోల నేతేరఁగన్. 106

క. మెత్తుముగదె మఱి మెప్పుఁగ ద్విగోత్తమచక్కఁదన మీతలోదరి కెదుటన్
మెత్తఁబడె దానిచెలువని, యొత్తితి గుసగుసలఁ బోయి రచ్చర లెల్లన్. 107

తే. వేయుఁగన్నులు వలయుఁ బో వీరిఁ జూడ, నని కవుల్ దంపతులచెల్వు వినుతిసేయఁ
గాదు పదివేలకన్నులు గావలె నని, మాందు చుండె సహస్రవిలోచనుండు. 108

చ. కలరొకొ యెవ్వరైన నవుఁ గాదని యడ్డము పల్కవార లీ
యిల మఱిఁ దా నెఱుంగనటు లెంతటిమాయలకాఁడు కన్యకా
తిలకము దార వోయ వసుదేవునిఁ గట్టడ సేసి వేయిక
న్నులు గలవేలుపుంబలెఁ గనుంగొను చుండె మురారి చెంగటన్. 109

క. మధుకరవేణులు కొందఱు, మధురోక్తులు వెలయఁ దెర యమర్చిరి సరగన్
మధుమథనజనకుఁ డంతట, మధుపర్కముసంగె నృపకుమారాగ్రణికిన్. 110

తే. దేవకియొసంగఁగా వసుదేవుఁ డప్పుడు, చంద్రకాంతపుగిండి గొజ్జంగ నీటఁ
బసిఁడిపళ్లెములోఁ బదాబ్జములు గడిగి, తనదుమేనల్లునకుఁ గన్య ధార వోసె. 111

ఉ. నూరెలఁ జేరి యష్టమహిషుల్ దగువారు నొసంగ నావలం
గోరిక నిక్కి నిక్కి కనుఁగొంచు నుపర్వ లెసంగ వాద్యముల్

బోరు కలంక సంగములు పొంగ వధూవరులం గడానిబం
గారపుమెట్టుఁ బాళ్లిలపుటికల్ గదియించిరి గొంద ఱైదువల్. 112

క. వడిఁ దెఱవల్ దెర వంపం, బడఁతుక నగుమొంగము గానఁబడియెన్ గాంతల్
తడఁబడఁగ శరన్మేఘముఁ, బెడఁబాసి చెలంగుచంద్రబింబమువోలెన్. 113

క. అమృత మొలుకునధరంబునఁ, గుముదచకోరముల నేలుకొనుశుభదృష్టిన్
గమలములకళలు గైకొను, రమణీమణిముఖముఁ దెలిచి రా జన వలయున్. 114

చ. పొలయలు కందు వేఁడుకొనఁ పొందికఁ దెల్పెడు లీల సిగ్గుదొ
ట్రిలినముఖాబ్జ మెత్తి మెడకిప్పిఁదికి హస్తయుగంబు సాఁచి వే
నలిఁ దెమలించి సౌఖ్యకలనస్థితి గట్టిగఁ బట్టి కట్టెఁ గ
వ్వలఁదుక కంఠసీమఁ గురువీరుఁడు మంగళసూత్ర మయ్యెడన్. 115

చ. తమతమవార లొండొరులదండఁ గరంబుల ముత్తియంపుఁబ
ల్లెము లిడి చేయి మీఱఁగవలెం జామి నీ కని యుచ్చరింపఁగా
నమితముగా సుభద్రపయి నర్జునుఁ డర్జునిపై సుభద్రయుం
దమిఁ దలఁబ్రాలు వోసి రెలనవ్వును సిగ్గును లోఁ దొలంకఁగన్. 116

తే. అగ్ని సాక్షిగఁ బెండ్లాడి యట్టి ప్రియవ
ధూటియును దాను బంగారు పీఁటమీఁద
నుచితగతి వెలయంగఁ గూర్చుండి పాక
శాసని చెలంగ దీవించి సేస లిడఁగ. 117

తే. మృగమదముచెంతఁ గుంకుమరేఖవోలె, నీలమణిపొంత నదిరిపాల్ప్రెఱుగువోలె
మేఘమునకు ఱంగటను దీఁగెమెఱపువోలె, నర్జునునిచెంగట సుభద్ర యలరె నపుడు.

చ. కలుగుఁ గలాపిశేవము జగంబుఁ బెండ్లి యటన్న నిట్టివా
రల కటువంటిపట్లు నెలపాయము రూప మొయార మూని పే
ర్కొలిగినరాచకూఁతు రఁట రాకొమరుం డఁట యేమి చోద్య మో
పొలఁతుమిటారిసిగ్గరులు చూపరమాడ్కి కెందు పేఁయుటల్. 119

క. అంతటఁ బాలోమీమఘభవతులకుం బెండ్లికొడుకు వందన మిడెఁ ద
త్ప్రాంతమునఁ బెండ్లికూతురు, గొంతటు తల వంచి మ్రొక్కఁ గొంకుచు నున్నన్.

శా. ఎంచంగాఁ దగు నత్తమామలను దా నిర్వేల్పులుంగా మనః
ప్రాంచద్భక్తిని సాధ్వి యందు రది మీపట్ల న్నిజం బయ్యె నేఁ
డంచుం జీరి శచీపురందరుల శాహ్లాదంబుగాఁ బల్కి మ్రొ
క్కించెన్ దేవకి యప్పు డర్థిమరుద్గ్వింబాలికన్ బాలికన్. 121

మ. పరిణయం బొప్పఁగఁ గృష్ణునిం గని సుపర్వస్వామి యాసర్వల
క్షణముల్ గల్గినకన్య మంచిగరునిం గాఁ జూచి మీ నేర్పునై
పుణి మీకే తగు నంచుఁ బల్కెఁ బరమాప్తుల్ మీర రాఁగా విజృం
భణవృత్తిన్ నెఱసెం బెండ్లి యని యప్పద్మాక్షుఁడుం బల్కఁగన్. 123

సీ. వియ్యంపుమర్యాద వేగుజామున శచీ, జాని బువ్వాన భోజనము సేసి
గుమగుమవాసించుకుంకుమకస్తూరి, యమరవల్లభునిహస్తమున కిచ్చి
గంబూర గుల్కెడుతాంబూల మిందు్రఁ డం, దుకొనఁదో సేవానిదోయిట నిడి
పీతాంబరముల విప్పి యనేకములు వజ్రి, చేతిసంజ్ఞ జయంతుచేతి కొసఁగి
తే. కేలఁ గేల్పట్టి కొన్ని వాకిండ్లు గడచి, రాఁగ విచ్చేసి యుండుఁడు రావల దని
బలిమి బలభేది యెదురుగ నిలిచి మ్రొక్క, వేడుక మురారి కేల్మోడ్చి వీడుకొలిపె.

క. అంతకు మును పేహరి య, త్యంతకుతూహలముతోడఁ దగుమేరల న
త్యంతఃపురిభోజసుతా, కాంతను బౌలోమి ననుపఁ గట్టడ సేసెన్. 124

తే. రుక్మిణీదేవితమయుత్తమోర్మిళ శచికిఁ, బసిఁడిగిన్నియఁ గస్తూరి యొసఁగ నామె
చేఁ దిగిచి దేవకీదేవిమీఁదఁ జిలికి, వదినె గాఁ గని యొకకొంత వావి నెఱపె. 125

ఉ. వీయపురాల నైతి గదవే యిపు డత్తవు తొంటివావి నో
తోయజనేత్రి గాంచినవధూమణి నీసుతఁ బెండ్లియాడఁగా
నాయను నారుమాఁటకు నర్మిలి హత్తఁగ నత్త వావిచే
నాయువు గల్గువాఁ డవు నటుండ్రి శుభం బగు దీన నెంతయున్. 126

తే. అని సరసలీల నుడుగర లంది యపుడు, పారిజాతంబుకతన మున్ పరిచయంబు
చాలఁ గల్గుటఁ బ్రియముతో సత్యభామ, తనకు మ్రొక్కిన నింద్రాణి నెనరుతోడ.

ఉ. చెల్లెల లెస్సలా పెరటిచెట్టుగ నాటినపారిజాత ము
త్ఫుల్లనవీనమానములతో విలసిల్లుచు నున్నదా సదా
యుల్లము దానిమీఁదటనె యుండును నా కది ప్రాపుఁ బ్రోవుఁ బు
ట్టిల్లుగ జొచ్చి నిల్లునయి వృద్ధి నొసంగను నీవ నెంతయున్. 128

క. అని యుచితోక్తుల వారల, మనములు రంజిల్లఁ జేసి మన్ననతో న
య్యనిమిషలోకాధీశ్వరు, ననుఁగుంబట్టంపుదేవి యరిగినయంతన్. 129

తే. ఏల యాలస్య మింక నిందుఁ బ్రోలు సొచ్చి, నాగవలి సేయుదురుగాక వేగ కదలి
పాండుదంపతు లని ధనపాకుండఁ దహా, యుంబుల నొసంగి సరఁ బయనంబు సేసి

ఉ. చంద్రికి పింఛలాంఛనుఁడు చంద్రిక లీనెడునవ్వుమోములో
నింద్రపురాక ధర్మజున కేర్పడఁ గా శుభలేక వ్రాసి వే

చెంద్రిక పెట్టె యందుపయిఁ జెంద్రికవన్నె యుసాలు సుట్టి ని
సందిరఁ దానె ముద్రయిడి చాకలచేఁ బనిచెన్ రయంబునన్. 131

క. ఈరీతి నన్ని యమరిచి, యారాత్రిరె యేఁగి శౌరి యశోదవ నుండెన్
సీరికడ దేవకియుఁ దన, గారాబుఁగుమారి నంపఁగా రమ్మనుచున్. 132

తే. అత్తవారింట సకలభాగ్యంబు లున్న, మగనిమీఁదటఁ దన కెంత మక్కువున్న
నాఁడుఁ బుట్టువు పుట్టింటి కాసపడును, గావున సుభద్ర యొకతియ గాఁగ నుండె.

తే. తల్లిదండ్రులు గారావఁ దన్నుఁ జేయ, వదినె లన్నలుఁ గను గారవంబు నెఱప
నల్లయూరంత బలగంబునందు నుండి, యొకతె నెడబాసి పోవ నెట్లోర్చునను.

క. అట్టులఁ దొంగలిరెప్పలఁ, దొట్టెడుబాష్పములతోడఁ దొట్రిలుముద్దుం
బట్టిఁ గని కడుపు చుమ్మలు, చుట్టఁగ నది చుట్టుపట్టిచి శుభ మొరంగన్. 135

తే. వింతఁటే యేమి మేనత్త గొంతిదేవి, కోరి వేఁడి యూఁ బెండ్లాడినవారు మీర
లొండొరులు నీవిభుండు లోకోత్తరుండు, దొరకెను సుభద్రమంచి కాఁపురము నీకు.

క. ఈలోనఁ జూడవచ్చెద, మేలే చింతిల్లెదనుచు నెంతయుఁ బ్రేమన్
గేలంగొమ్మడి దువ్వుచు, బాలన్ దీవించి తల్లి పనుపన్ వేడ్కన్. 137

మ. సకియల్ గొందఱు వెంట వచ్చి మణిభూషల్ చక్కఁగాఁ దీర్చి చెం
ద్రికపూవన్నె యజిల్గుఁజేల కటి నొంతే గట్టిగాఁ జుట్టి పెం
డ్లికుమారుండు కరాగ్ర మూఁత యొసఁగన్ వ్రీడావతిం దేరి మీఁ
దికి నెక్కించిరి మందహాసకలనాదేదీప్యమానాస్యలై. 138

తే. అటులఁ దేరెక్కు దంపతు లరుగఁ జూచి, జనులు రతిమన్మథులు వీర లని తలఁచిరి
వారితురంగము లించువిల్లలరుతూపు, లంద యుండంగ సందియ మంద నేల. 139

శా. పచ్చనిపచ్చడంబుదొర పూపిన తోరవనె బోవుంతతో
నచ్చటఁ దెల్లవాఱ నితఁ డక్షుఁ డిమె సుభద్ర వీరిఁ బో
నిల్చినమాట నమ్మ బలకృష్ణులచేత నటంచుఁ దారు తా
రెచ్చరికై పృథుశ్రీరసుఁ జేలికఁ గాఁ గలపోల్రి కాపురున్. 140

క. అలబలము లసంఖ్యములై, అలబలములు నేయుచుండ నప్పుడు గలఁకం
గలకంఠీమణి రిపుమద, కలకంఠీనవుని ధవుఁ గని వికసితయై. 141

పంచచామరము. హుటాహుటిన్ హలాయుధుం డహో మహోగ్రుఁడై తనం
తటం దటాన నిప్పు డీఁగఁ బెఱింగి వచ్చెనో
ఘటాఘటీల నెల్లఁ దోవఁ గట్టి పట్టఁ బంచెనో
యటో యిటో యటో భటోద్భటార్భటుల్ ఘటిల్లెనన్

తే. తేరుగడపంగ మాయన్న దిద్దె నన్న, నేయ నేరిపె వింట నొక్కింత వాఁడు
వావదిని సత్యభామ యున్నఁగక నైన, నిలిచియున్నఁగక కానురు గెలిచెఁ గాదె. 143

క. అని రాజకన్య గావుఁ, మనమునఁ గలధీరతయును మమతయుఁ దెలుపన్
విని యట దరహాసంబున, ననుఁ జెక్కిలి చికిలిగోట నొక్కుచు వేడ్కన్. 144

క. వన్నెవ్వాఁగాఁ జూచితి, కన్నియ నీచేయునంత కార్యంబిట నే
మున్నది మాకును జెండెన, భిన్నాభిన్నములు గాఁగ సేనల నెల్లన్. 145

క. నీవేమి కేలగాదనఁ, గావలె నటువలెనె తేరు గడపు మటంచున్
చేవిలువమ్ముల, నైకొని నావిజయుఁడు సమరసన్నాహదోహలుఁడై 146

ఉ. అంతటిలోఁ గృపకృతవసుఁ డాదిగఁ గల్గినవీరయోధు ల
త్యంతకఠోరతోమరశరాసనబాణకృపాణ పాణులై
పంతము లాడుచుం బదరి పైఁబడఁ జూచుటలంబు లెల్లఁ దా
మంతట నంతట న్నిలిపి యుద్ధముగం జని యాధనంజయుఁన్. 147

ఉ. స్యందనముల్ దురంగములు శౌరివె పో బలరాముచెల్లెలై
యిందునిభాస్య యీమె నెట కెత్తుకపోయెను రాకుమార యే
మందురె యాదవుల్ వినిన హా యిటువంటివె రాచవారితోఁ
బొందులు గానరుండఁ గొనిపోఁ దగవా మిమువంటివారికిన్. 148

క. అనుటయు నే మీకనినం, గనుఁగొండిన వానఁ బూనఁగలరా మీరల్
మనవలసిన నీమాటలఁ, బనిలేదు చనుం డటంచుఁ బైఁ బడి రాఁగన్. 149

ఆ. రాకురాకు మనెడిరట్టడికలములు, పోకుపోకు మనెడిపొగరువగలు
పొడువు పొడువు మనెడి బెడిదంపుబీరముల్, విడువు విడువు మనెడివీఁక లెసఁగ.

ఉ. ముందరవెన్క నీకరణి ముంచుకొనం జలియింప కిం పొస
ర్పం దరళాక్షి తేరుగడపన్ గడకంటనె పాఱఁ జూచి విం
టం దొడి యేయుటల్ బయలు లాఁగ్వ యెంతటి నేరు పౌర పొ
రందరి యాదటన్ శరపరంపర సొంపరలాడె నయ్యెడన్. 151

సీ. కొండలవలెనున్న కొమ్ముఁగత్తులభద్ర, దంతావళములమొత్తములు బలసి
యంబుధితెరలచందంబునఁ దుటుములై, ఘోటకంఘాణబలము లొదవి
విరివిరై మేఘముల్ పెరిగి వచ్చిన జోక, ఘనపతాకల శతాంగములు హత్తి
పొదరుపొదల్ పేర్చువిధమునఁ గనిపించు, గడలవాఁజులు సమగ్రముగఁ గూడి
తే. యుక్కుపాడిరాల రోమంబు పిక్కటిల్ల, నొకరొకరి కేవ పెట్టు నక్కొగ్రసింహ
రవములు సెలంగ సైనికప్రభుఁలు దార, నిలి యుదారశిలీముఖాచ్ఛలము సటింప. 152

నిస్సాణప్రముఖనిస్వనంబులు బోరుకలంగ నలంకృతనిస్తుల స్తంభేరమారూఢుం
డై గగనోల్లేఖితోరణధ్వజోల్లోచ ప్రాంచత్సౌధప్రచయ ప్రచలత్ప్రచలాకిచిత్ర
చ్ఛవివ్యాప్తహేమచ్ఛవిఫలకచ్ఛవిరాజత్కంభాస్తంభవిజృంభిత ప్రతిమందిరంబును,
విలోకితబిబ్బోకవతీవ్యాకోచ లోచనప్రాంతమర్యాదవిభ్రాజమాన తనూజోత్సవ దివ్య
ష్టాగృహీతానేకవిగ్రహాసహాసాంబకవిడంబిధర్మ్య హర్మ్యనికరంబును, నీరాజనలా
జాక్షతకుసుమకిసలయవ్యాకీర్ణ కలశగ్రహణాయాత మహీలేఖమహిళాభూయిష్ఠ ద్రాఘి
ష్ఠవేదికాంతరంబును నగు నిజపరిష్కృతపురంబును, సకలజనరంజనకుశలవిశాలకటాక్ష
కృపారసావేశంబునఁ బ్రవేశించి యున్న సుదతీముహూర్తంబున నుత్తరాభద్ర
భద్రేయమానం జతురంతయానంబున నధ్వాంతంబున కనిపి ధౌమ్యాదుల కభివందనం
బుగావించి యాశీర్వాదంబులు గైకొని నిజాగమనసంతోషరసోన్మేషభూషితముఖ
సన్నాననవిసరిసూండును, రత్నసింహాసనాసీనుండును నగు ధర్మనందనునకు సా
ష్టాంగం బెఱఁగి, భీమసేనునకు నమస్కరించి యంతఃపురికిం జని కుంతీదేవికి వందనం
బాచరించి ద్రుపదనందన నుపచరించి యిష్టాలాపంబుల సుఖంబుండె. 158

ఉ. అంతట ద్వారకాపురమునందు సభాపరిపాలుఁ డగ్రజుతో
దంతయు యాదవుల్ గొలువ నుండఁగ హాజారమునందు భేరి య
త్యంతభయాకరాయితప్రాదంగురుఁ డై చఱపించెమించెది
గ్దంతిఘటాశ్రవఃపుటభిదాచణభీషణభూరిభాంకృతుల్. 159

క. ఆనాదము విని వాలి మొనఁ, గైవసుధాదర్పహరుఁడు పురికి నరుదెంచి సభా
సీనులయి నరునికపటుని, ధానము మఱి మఱియు నడిగి తప్తాశయుఁడై. 160

తే. మతి ననుమ వేషభాషల నటమటించి, పొంచి తఱి వేచి కన్నియఁ గొంచు నరిగె
దొరకుసన్న్యాసవేషమనుమాటతిరము గాఁగ, నగునంచు దద్దిరా యెంతమ్మఁ జుంచు. 161

శా. ఏతన్మాత్రమె కార్యభారము విధి వైనమెత్తైన నే నేఁను ని
ర్భీతిన్ బాలికఁ గొంచుఁ బోవ నుచితంబే కుందగర్వంబు దు
ర్నీతుల్ యాదవవీరసింహములతో నే నా బలారా బలా
రాతిప్రాభవుఁ డేఁత సేసె నిదితీరా వీరనాబ్జోలికిన్. 162

ఉ. వంచన సేసి యిట్లు చెలువం గొనిపోవఁ బ్రలంబవైరి సై
రించునె మర్మదాధిపవరేణ్యులభూములు దున్ని ధూళి గా
వించఁడె పిండిపిండిగఁ బ్రవీరవిరోధికిరీటరత్నము
ల్ద్రుంచఁడె ఘోరసీరముసలంబులు వ్యర్థములే ధరింపుటల్. 163

క. అని కాళిందీ భేదనుఁ, డనువాక్య మొకింత విన్నయంతనె మేఘ
ధ్వనిఁ గెరలెడుసదకేసరు, లన యోధాగ్రేసరులు మహామత్సరులై. 164

ఉ. యాదవవార్ధి వెల్లివిరియన్ మఱియాఁగెడుపాటివీరుఁ డి
మ్మేదిని నెవ్వఁ డిందులకు మీరలు గావలె నేమె చాలమే
పోదుమె కట్టితెత్తుమె ఋభుప్రభునందనుఁ డెంత వానితం
డ్రే దురమం దెదిర్చినను రేపు మడంతుము మాటలేటికిన్. 165

తే. అని యాదగ్రహాలగ్రహవ్యగ్రిఁ డైక
యన్న మాటలు సభవార లన్న మాట
లేమి చవిగామికును దాల్మి యేమి భక్త
జనకుశలకామి యలయదుస్వామి కనియె. 166

క. యదురాజకులశిరోమణి, యెదురా మీ కొకరుఁ డుచిత మెఱిఁగియుఁ బరు లెం
చ దురాప కోప మానుట, చనురా తెగఁ జానిచోట సైరణ తగదే 167

క. ద్రోణాచార్యులశిష్యుఁడు, బాణాసననిపుణుఁ డరినృపాలకమకుటీ
శాణాగ్రతేజతోగ్ర కృపాణాంచద్బాహుఁ డతండు ప్రభుమాత్రుండే. 168

ఉ. ఆపురమర్దనుం డయిన నాతని సద్దము దాఁకి నిల్వఁగా
నోపఁడు మత్స్యయంత్రము మహోద్ధతి నేసి స్వయంవరంబునన్
ద్రౌపదిఁ గైకొనం జెనకు రాజకుమారులపాటెఱుంగమే
మూఁకలు మూఁ డగున్ రిపుచమూఁపులఁ గన్నపుడే కిరీటికిన్. 169

ఉ. మాలిమి లేదు గాన ననుమానము నామదిఁ దోఁచె నప్పుడే
బాలిక సేవ సేయఁ బనుపన్ వలదంటిని గాదె దానికే
మీలువు కల్గు మేనమఱఁ దింతయె యాతఁడు నైన దైవనే
లోలత నింక నాగవలిలోపల నిష్ఠుర మేల పల్కఁగన్. 170

ఉ. క్రీడిసమాను లెంచఁ గలరే యిల నేఁడులలోనఁ దూలఁ బో
నాడఁడు వైరినైన విడనాడఁడు నెయ్యము కోపగించియుం
జూడఁ గలట్టివాఁడు నరఁడుండు సుభద్రకు పార్శ్వ వార్ధిలో
నాడఁగ నంతకంటె నను వైఖరిం డింక నెవ్వఁ డవ్వలన్. 171

ఉ. నమ్మినవారు పాండునృపనందను లందఱిలోనఁ బెద్దగా
మిమ్మె గణించు ధర్మజుఁడు మీ రటులన్ విజయంబు సేయ వే
గమ్మెదు రేఁగుదెంచి కడుఁ గన్నులఁ గప్పుకొనం బడుం డఁం
దమ్మునిమాట యన్న జవదాఁటనియన్న ససంభ్రమంబుగన్. 172

మ. గజకంఖాణశతాంగపత్తిజనవర్గంబుల్ సమగ్రంబు లై
భజియింపం బితృపుత్రిపౌత్రిసుహృదాప్తశ్రేణిఁ గూడం బ్రియా
నుజుఁడుం దాను సమస్తవస్తుధనసందోహంబుతో వచ్చె స
ర్వజనానందకరంబు గాఁగ నటు లింద్రప్రస్థముం జేరఁగాన్. 178

ఉ. అంతట మున్నె కృష్ణుఁడు హలాయుధుఁ దోడ్కొని వచ్చుచున్న వృ
త్తాంత మెఱింగి కీవి మెఱయన్ నగరిం గయిసేయఁ బంచి య
త్యంతవినీతి ధర్మజుఁడు దమ్ములుఁ దా నెదు రేఁగి రేవతీ
కాంతునకుం బ్రణామములు గాన్కలు సేసి యథాక్రమంబునన్. 174

మ. చెలువం దెచ్చుచు నుండి యాసున సునాసీరాత్మజుం డమ్మహా
బలముం జేరఁగఁ బోయి మేదురదురాపక్రోధముం బాసి లో
నలరం గౌఁగిటఁ జేర్చె శుంభుజభుజాహంకారరేఖానిర
ర్గళమార్గప్రబహంబ్రిలంజహు బహుంకారంబుగఁ బల్కుచున్. 175

ఉ. బావయటంచు వాని నదపన్ భయభక్తుల మ్రొక్కవచ్చు న
ద్దేవకిపట్టి ధర్మజుఁ డతిత్వరితమ్ముగఁ గ్రుచ్చి యెత్తి త
ద్భావ మెదం గుమర్పడఁగఁ దాల్చినభంగిఁ గవుంగిలించి మా
కీవ గదయ్య సర్వశుభహేతువు నిచ్చలు నంచు నెంచుచున్. 176

తే. కెడల బలరామకృష్ణులు నడమఁ దాను, భద్రదంతావళము నెక్కి పాండవేయ
ముఖ్యుఁ డతిరాజసంబున ముత్వాలుఁగు, ప్రోలికిఁ బోసంగ వచ్చెను బ్రోలికపుడు.

ఉ. అంతిపురంబులోన నరిగి యన్నరు వందన మాచరించు నా
కుంతికి మ్రొక్కి భక్తిఁ దమకుం బ్రణమిల్లినద్రౌపదీసతిన్
స్వాంతము రంజిలం బలికి శ్యామహారిత్ పరిధాను లొప్పి రం
తంతట నిష్టబాంధవసమాగమసౌఖ్యమునం జెలంగుచున్. 178

క. దొర వెట్టిన వారు వెట్టిరో, యరువాహో విడుదులన్న హవణికలులపా
పరిషవము నిందప్రభోగమె, దొరకెను దమకననివారు తుది లేరాకరున్. 179

క. వీయమువారికి నిట్లు ద, వీయముగా నుండి వచ్చి విపులశ్రియముల్
దీయముదం బొసరిచి కడుఁ, దీయము కనిపింపఁ గా యుధిష్ఠిరుఁడనియెన్.

క. చనవున జలిమిం గన్నియఁ, గొని వచ్చి వివాహ మాటదు స్వతంత్రులఁ గా
నొనరించినార మమ్ముని, ట్లనఘాలత గల్గుబంధు లవనిం గలరే. 181

తే. ఆదినారాయణుం డీమురారి; యుగకులభూషణుండ వీ శరసిచూడ
నిట్టిమీబాంధవము గల్గ నెట్టితపము, సేసినార మొకో వేము సీరపాణి. 182

చ. అని ప్రియభాషణంబుల మనోజ్ఞము రంజిలఁ జేయ సంభ్రమం
బున వారి సర్వసన్నాహముం దగ నిల్పెను రేఁగి పెండ్లి సే
సినదార యెందు లేఁ డనఁగఁ జెల్లెలి ముద్దుమురందిఁ గోరికల్
వెనఁగొనఁ బెండ్లికూఁతుఁగనుఁ బెండ్లికుమారుఁగఁ జేసి వేడుకన్. 183

సీ. సకలవాద్యములు బోరుకలఁగ నెడ మీఱ, నలుఁగులు నులుపాలు నడుచుచుండ
నిఖిలబాంధవరాజనికరంబు మేలైన, యుంకువగరల్ గొని వచ్చి పాదఁ గనంగ
శ్రోత్రియవిద్వత్కవిశ్రేణులు యథేష్ట, సంభావనలఁ జాల సంభ్రమింప
విందులఁ గర్పూరవీటికాంబరవసం, తముల నెల్లజనంబు తనివి నొందఁ
తే. బ్రియము వినయంబు దాల్మి యోపికయుఁ గల్గి, యమ్యతాగ్రజభీమసేనాగ్రజన్మ
లెంతటిమహాత్ములని జగం బెంచఁ జేసి, రుచిరగతి నొప్పు వైవాహికోత్సవంబు.

ఉ. అంతట నైదునాళ్ళను మహామహిమం దగి దంపతుల్ గృహా
భ్యంతరదేవతార్చనలు తైతల కర్మిలి మ్రొక్కి రుక్మిణీ
కాంతుఁడు వల్కె రేఁగవు గ్రమ్మఁగ మీ రిటు లెల్లకాలముల్
మింతురుగాక శోభనముమీఁద నెశోభనమై ముదంబునన్. 185

క. అని దీవించిన లోలో, ననె ముసిముసినవ్వు లొలయఁ గూర్మినను లై
తనరి రివా రామాటకు, ప్రనరభివాదనము సేయఁ బోల్కి జనింపన్. 186

చ. తొలఁకెడుపేర్మి బందుగులతో మణిపాత్రిక లందునప్పు డు
జ్జ్వలదమృతాన్నముల్ కొలముసామికి నప్పన గాఁగఁ బందువె
న్నెలబయలన్ భుజించి నెఱినీ టెసఁగన్ సగపాలుఁగంబురా
గులికినకమ్మవీడె మొకకోమలి యీఁ గొని క్రీడి వేడుకన్. 187

ఉ. చందురుడాఁతి బాగడపుజంటపవంతి వెడందయంకణం
బుందగులూని పార్శ్వమునఁ బొల్పగుపల్వగ కెంపుటంచుటా
కుం దెలిగుండుకంబముల క్రొంజిగిబోదెల నందగించి పై
సందులఁ బంచవర్ణమణిజాలకముల్ రహిఁ జూప లోపలన్. 188

ఉ. బంగరుమేలికంబములఁ బాటిలువాటుప్రమధ్యరంగమున్
జెంగట జీవరత్నములచెక్కడపుంబని మించు సెజ్జయి
ల్లుంగల వజ్రపుంబలుక లోవ పొసంగిన నొప్పుచప్పర
మ్ముం గలభావచిత్రనవమోహనకేళిగృహాంతరంబునన్. 189

చ. కెలఁకుల వజ్రముల్ నడుమఁ గెంపులు మూలల ముత్తెముల్ పర
స్థలముల, బచ్చలుం దనరి జాతి దగం బని వార్వ్యందమున్

వెలయఁగఁ జేరి చూడఁ గడు వింతయుఁ గోటికిఁ గోటి యైనను
న్వెలువ యొనర్పరానియొక నిద్ధపుమంచముపై వసింపఁగన్. 1.0

ఉ. గోవజవాదికస్తురియుఁ గుంకుమ గంధము మైఁడిగిన్నెలన్
దావి గుబుల్కొనం గెలఁకు దార్చిరి పంజరకీరశారికల్
దేవ పరాకు సామి యని తెల్పఁగ రత్నపుఁ గీలుబొమ్మలే
కావలెఁ గొంద అందు నుడిగంపుటొయారపుముద్దుజవ్వనుల్. 191

క. అందలికొందలి యంబో, ల్లందలికందళితశుకముఖాలాపరసం
బందలి యంగలి మంబులు, నందలిబొండ్లదితెరలు నవలం గలవే. 192

ఉ. చక్కఁదనంబు లెల్ల నొక చక్కినె దొంతరగాఁగ నిల్చెనో
యొక్కెడఁ జూడఁ జూడఁ గని యే విడిపట్టుగఁ జూడఁ జూడఁగా
మిక్కిలి వింతయై మెఱయు మెచ్చులకున్నెలవీ దొకింత య
మ్మక్కువ నతిపఁగాఁ దరమె యీపడకింటివిలాససంపదల్. 193

తే. ఉండెడి నరపతి యందు మే నుబ్బుచుప, నఖిలసామ్రాజ్య మేలినయంత వేడ్క
రమ్య మగునిల్లు మేలైన రాజముఖియుఁ, గల్గెనేని యంతకన్న భాగ్యంబుగలదె

క. అంతటఁ బ్రౌఢసఖీతతి, కాంతామణిఁ గాంతుకడపఁ గదియించుట కై
వింతగ మోమునఁ జెఱుగఁగ, వింత గనంబడఁగ ముదితహృదయాంబుజ లై. 195

సీ. జడముచ్చుఁ గ్రైసీయ ముడువు చేడియ విరుల్, వేసలి వట్టివ పీడకుండఁ
జేర్చుకు నతి యుండ తీర్చుము తిలకంబు, కస్తూరి చెమటచేఁ గరఁగకుండఁ
గొనుజంటఱవికఁ గుసుమగంధ మలఁదుమో, చెలి యెంత యొరసినఁ జిటులకుండ
మొలనూలిదిగో బోటిచలువ పొందుగఁ గట్టు, పయ్యాటలనె నీవి సడలకుండఁ
తే. తరుణి కివియిచ్చుఁదగ మెచ్చు తప్ప దనుచు, నేరుపరులైనవారిఁ గా మేలుపఱుపఁ
గాంతనవసంగమార్హశృంగారవిభవ, లీల నలరించి రాజవరాలి నపుడు. 196

క. తడ వేటికి లేజవ్వని, విడె మీవలెఁ బతికి మంచివేళ సుమీ యి
ప్పుడు రాకన్నిను వల్లభు, కడఁ బెనఁగకు గాక పెనఁగఁ గా నిటఁ దగునే. 197

సీ. ప్రియుముతో రమ్మని పిలిచినఁ జేరవో, యెందవు గా కూరకుండెదవు సుమ్ము
చెంతఁ గూర్చుండఁగఁ జేఁ జూపఁ గూరుము, డెదవు గా కూరకుండెదవు సుమ్ము
విడెము చేతి కొసంగ వినయంబుతోఁ గం, దెదవు గా కూరకుండెదవు సుమ్ము
మధురోక్తి వినఁ గోరి మాటాడ మాఱువ, ల్కెదవు గా కూరకుండెదవు సుమ్ము
తే. కాక విభుఁ డైనఁ గొంత సిగ్గరితనంబు, గడలుకొనియున్నఁ గ్రియ్యఁ గడకు రాక
చక్కఁగ నొకింతసే పటు సమ్ముఖమున, నిలువుమీ రత్నపాంచాలి చెలువు మీఱ.

భర్తకు నమ్ము లోకకలభాషిణి యందఱఁ దెల్ప మందగా
మిని యనుపల్లు నవ్వు డిచు మిక్కిలిగాఁ దనయుంచు నిల్వఁగన్. 207

ఉ. తాలిమిఁ గ్రుంగఁ ద్రొక్కి మదిఁ దత్తరముల్ దమియించ్ భయంబు హే
రాళము గాఁగ మైఁ జెమట గ్రమ్మఁగఁ గొంకుచు మెల్ల మెల్ల నే
బాలిక యేఁగుదెంచె విభుపాలికిఁ బ్రాణసఖుల్ దెమల్పఁగా
యేలిక మ్రోలకున్ మనవి సేఁగెను నయ్యభిమానిపాలికన్. 208

చ. చంచలనేత్రి రాఁ గలుగు సంభ్రమమే మనవచ్చు వాసనల్
ముంచుకొనెన్ సముత్స్పృహముల్ మిఱుమిట్లులు గొంచు నల్గడల్
ముంచుకొనెం దనూరుచులు నుంగిటి కించుక రాక త్రోల్తనే
ముంచుకొనెన్ నృపాలునను మోహముఁ గోర్కులు నెమ్మనంబునన్. 209

తే. మఱుఁగఁ గోరెడు కన్నియ తెఱఁగుఁ జూచి
చూడఁ గోరెడి యువరాజు జాడఁ జూచి
వలఁతు లయినట్టి తూర్కిని పాలఁతు లపుడు
కూర్చి సమకూర్చి యిరువురఁ గూర్చిరి. 21)

తే. తేనె దానెట్లు గడపెనో తెలియరాదు, తేనె గదలించినట్లు దోఁతేరవలసెఁ
గన్నె యింతదాఁక నే మెఱుంగదు సుమయ్య, తేనెగడ కాఁగ మెల్లనె దిద్దుకొనుము.

క. పాటలబింబాధర కని, గాటుల కోప దని పలుకఁగలు తెలుపంగా
నేటికి నెఱిఁగి పదుపుము, మీటిన పిచ్చుచనుదోయి మీచేతి దిఁకన్. 212

తే. మీర లెఱుఁగంగ వలయు శృంగారమెల్ల
యువతితిలకంబు కంటె నోనవమనోజ
విభుఁడు మది మెచ్చి కర్పూరవీటి యొసఁగ
ముద్దుమొగ మెత్తదే యో మోహనాంగి. 213

క. వలరాజు కొల్చునంతటి, చెలువుఁడు నిను గూడఁ గలిగెఁ జెప్పెడి దేమీ
కలఁ డిఁక నీపాలింటన్, జెలి రా యలచందమామ జేజే యెపుడున్. 214

క. రావక్క రక్కులాకులు, గోవక్క శుభోత్తరముగ గొబ్బున విభుచే
నీవక్క సేవ సేయుము, నీ వక్కఱ కలిగి రమణునికిఁ జిత్తము రాన్. 215

తే. అనుచుఁ గప్పురబాగాలు నాకుమడుపు
లచ్చకోరాక్షిచేతి కందిచ్చి మిగుల
నంతికము సేర్చి చేపట్టుమయ్య కోర్కు
లాదరంగాఁ జేకొను నాసామి యువతిజనము. 216

సీ. జిలిబిలిగలి వాలి మొలకతెమ్మెరలుఁ గ, మ్మని మేనితావుల ననుసరింప
వలఁగొఁడేని కు లాని తులరుతుమ్మెద, దిమ్ము జంటమాటలవెను వెంటఁదిరుగఁ
జిగురాకుమేఁతలఁ బొగ రొందుకోయిలల్, పాటల నీటు వెంబడి వెలుఁగఁ
గుబ్బఁబల్కుల కొద్దు గుబ్బ చిల్కలనేర్పు, పలుకుల బెళుకులపజ్జ నిలువ
తే. సతియుఁ బతియును నారామతతుల నతుల
రతులఁ జెంగిరి చగురత లతికయిల్లఁ
దోలుతఁ దము నేఁచువారలె కొలిచి యుండ
వేడ్క కన్నను మతి వేఱె వేడ్క గలదె. 225

క. నెల నుసలెనంతఁ గాంతకు, నెలకొనె వేవిళ్ళు పెల్లు నిద్దపుమేనం
దళతళ మని మెయిపూఁతల, తళతళఁ దళుకొత్తఁ గొత్త నవళిగుపోఁ చెన్. 226

సీ. కలదు లేదో యనుకౌను గానఁగ నయ్యె, నప్పల నలసత గప్పుకొనియెఁ
గులుకుఁ జన్గుబ్బలు వలుదలై మెఱుఁగెక్క, నూఁగారు పైఁగప్పు నూలుకొనియెఁ
జెమ్మట్టద్దబుల నెక్కెనెఁ దెలినిగ్గు, బడలిక నమ్ముఫలఁ గదలుకొనియెఁ
జిట్టాటచెమటల చిత్తడి మెయినిండె, సారెకు నూర్పులు సందడించె
తే. నరుచి గన్పించె నొక చెల్వ మంకురించెఁ
దలులు సము మయ్యెఁ జిట్టుముల్ దలుము మీఱె
మొలచెఁ గోర్కులు నెమ్మోవి నిలిచె నలఁత
నెలఁత కేర్పడఁ దౌలుచూలు నిలుచు నపుడు, 227

మ. కలుముల్ గన్నులఁ జిల్కకల్క మగునిం గన్నట్టిచందాన వా
కలశాంభోనిధివీచికల్ప తరువుం గన్నట్టియుండెంబుగన్
గలకంఠీకులరత్న మంత శుభలగ్నం బందు నిం పొందఁగాఁ
గులదీపం బగునట్టిపట్టిఁ గనె దిక్కుల్ దెల్వి దెం పెక్కఁగన్. 228

క. బుధవిభుసుతువకుఁ దనయుఁడు, పొడవించినసమయమున గుబాలునఁ గుసెన్
నభమున సునవోవర్షము, గుభగుభని దములఁ గ్రిందుకొనె దుందుభులున్. 229

గీ. అపుడు పార్థుండు శుభలేఖ ననుప నరుప, మా విభవుండు శౌరి సమానమాన
వాధినాథులు కొలువంగ నరుగుదెంచె, నెలమితోడుత పాండవు లెదురుకొనఁగ. 230

క. హరి సాత్యకితోడఁ గుతూ, హలియై తనసరస రాఁగ నంగనయును దా
నల బలరిపుసుతునగరికి, నలబలము చెలఁగ నరిగె హరి గడు వేడ్కన్. 231

క. మన్యువివర్జితుఁడల శత, మన్యుతనూభవుఁడు లోకమాన్యనిపశ్చి
న్మాన్యులయనుమతి నభి, మన్యుం డని పేరు వెట్టె మది ముదమొదవన్. 232

క. చెల్లెలికిని మఱఁదికి మే, నల్లునకు ననర్ఘ్యమణిమయాభరణంబుల్
వల్లభయుఁ దాను యదుకుల,వల్లభుఁ డప్పు డొసఁగె బంధువర్గము మెచ్చన్. 233

తే. కువలయాక్షులు పెనుచుమక్కువ వలవలన, నేఁటఁ బెరిగెడివాఁ డొక్కపూఁటఁ బెరిగి
మెల్లమెల్లన శైశవ మెల్ల జాఱ, నందె యౌవన మారాజనందనుండు. 134

సీ. మనుమార్గమున భూమి మనుమార్గ మంతయుఁ, స్థిరబుద్ధియగు యుధిష్ఠిరుఁడు దెలుపఁ
బాటవనద్వైరిపాటనక్రమ మెల్ల, దనవర్జితుఁడు వృకోదరుఁడు దెలుప
రంగదుత్తుంగతురంగాధిరోహ ముద్దండబాహుండు నకులుండు దెలుప
సురభిరత్నకీర్తి సురభిశదిజ్మండ,లుం డగుకడనుజన్ముండు దెలుప

తే. వివిధకోదండపాండిత్యవిలసనంబు, తాన తెలుపఁగ నేర్చె నత్తనయుఁ డపుడు
సేవ సేయఁగ సంతతశ్రీ వెలుంగ, విజయుఁ డలరారె శాశ్వతవిజయుఁ డగుచు. ౨౩౫

క. శ్రీరాజిలు రఘునాథో,ర్వీరమణుని పేర వెలయు విజయవిలాసం
బారోగ్యభాగ్యసంప,త్సారస్వతజయము లొసఁగు జదివిన వినినన్. 236

## —| ఆశ్వాసాంతము. |—

ఉ. క్ష్మాశరశైలలాంఛన విజిత్వర శుభ్రయశోవిశాల ధా
రాళగళన్మదద్విరదరాజివిరాజిభాంగణా ఘనా
వేలగభీర జానపదపీపరితోషిత శశిగౌతమా
చోళకవిద్విజస్తుతకచోళగ చోళగమానభంజనా. 287

స్రగ్వి. దుగ్ధవారాశివిద్యోతకీర్తిసుధా, భుగ్ధురీణామ నాగోభవశ్రీదయా
దృగ్ధుతాశేషధాత్రీమరున్నిస్వతా,స్నిగ్ధ సారస్వత స్నిగ్ధసారస్వతా. 238

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధప్రసిద్ధసారస్వతసుధా
సారజనితయశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యతనయ
వినయధురీణ సకలకళాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ
భూపాలదత్తహస్త ముక్తా కటక విరాజమాన
వేంకటకవిరాజప్రణీతంబయిన విజయవిలాసం
బను మహాప్రబంధంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము
సంపూర్ణము.

కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ.

# నాటకములు.

| | | |
|---|---|---|
| గయోపాఖ్యానం చి॥ ల॥ | 0 | 8 |
| ప్రసన్న యాదవము | 0 | 8 |
| పారిజాతాపహరణం | 0 | 8 |
| పార్వతీపరిణయం | 0 | 6 |
| స్వప్న వాసవదత్త | 0 | 6 |
| సతీ-అనసూయ అ॥ సో॥ | 0 | 12 |
| చింతామణి | 1 | 0 |
| ప్రహ్లాద | 1 | 0 |
| విచిత్రచిత్రమాల | 0 | 12 |
| ప్రమదామనోహరం | 0 | 10 |
| మహానంద కో॥ సు॥ రా॥ | 0 | 12 |
| శారదావిజయము | 0 | 12 |
| సంపూర్ణ రామాయణం | 1 | 4 |
| భక్తకబీరు | 1 | 0 |
| తులసీదాసు | 1 | 0 |
| సంపూర్ణ ఆంజనేయం | 1 | 0 |
| వేశ్యామరందము పె॥ వెం॥ | 0 | 4 |
| సంపూర్ణ భారతము పం॥ శిం॥ | 1 | 4 |
| కృష్ణలీల సాంగ్సుగలవు | 1 | 0 |
| సంపూర్ణోత్తర రామాయణం | 1 | 4 |
| పాండవజననము రా॥ నా॥ క॥ | 0 | 12 |
| పాండవోద్యోగం | 0 | 12 |
| పాండవప్రవాసం | 0 | 12 |
| పాండవఅశ్వమేధం | 0 | 12 |
| సువర్ణ పాత్ర | 1 | 0 |
| పాండవవిజయం | 1 | 0 |
| సతీతులసి | 1 | 0 |
| అహల్యాశాపవిమోచనం | 0 | 12 |
| కుశలవపట్టాభిషేకం | 0 | 12 |
| సత్యహరిశ్చంద్ర | 0 | 12 |
| శ్రీరామజననం దో॥ సీ॥ రా॥ | 0 | 8 |
| శ్రీరామవుద్యోగం | 0 | 8 |
| శ్రీరామప్రవాసం | 0 | 8 |
| శ్రీరామఅశ్వమేధం | 0 | 8 |
| శ్రీరామవిజయం | 0 | 8 |
| ఆంధ్రప్రతాకం | 1 | 0 |
| ద్రౌపదివస్త్రాపహరణం | 0 | 12 |
| ద్రౌపదీపరిణయం | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారం | 0 | 12 |
| లంకాదహనం | 0 | 10 |
| పాండవాజ్ఞాతవాసం | 0 | 10 |
| వేశ్యాహితబోధిని | 1 | 0 |
| వేశ్యామధురం 1 వ భాగం | 1 | 2 |
| వేశ్యామధురం 2 వ భాగం | 0 | 8 |
| వేశ్యామధురం 3 వ భాగం | 0 | 10 |
| సంగీతశశిరేఖ | 0 | 12 |
| సారంగధర | 0 | 12 |
| ఉషాపరిణయం | 0 | 8 |
| పాదుకాపట్టాభిషేకం | 0 | 12 |
| పీష్వా నారాయణరావు | 0 | 10 |
| లోకాభిరామాయణం | 0 | 8 |
| రామాయణసారం | 0 | 12 |
| శ్రీనివాసకళ్యాణం | 0 | 8 |
| జారవిలాపం | 0 | 12 |
| చతురచంద్రహాస | 0 | 8 |
| విచిత్రబిల్హణీయం ఉ॥ ఆ॥ | 0 | 8 |
| మణిమాల | 0 | 12 |
| దుర్గాకతి దం॥ కి॥ స్వా॥ | 0 | 1 |
| దానవీరకర్ణ సో॥ రా॥ | 1 | 0 |
| శ్రీరామపట్టాభిషేకం జ॥ ల॥ | 1 | 0 |
| సత్యాబాయి | 0 | 12 |
| సురసుద్దాల | 0 | 8 |
| విజయభాస్కర నాటకం | 1 | 0 |
| హనుమద్రామసంగ్రామం బ॥ కో॥ | 0 | 12 |
| సుమతీదేవి | 0 | 12 |
| సంపూర్ణ భాగవతము | 0 | 12 |

పసుపులేటి వెంకట్రామయ్య & బ్రదర్సు, బుక్ సెల్లర్, రాజమండ్రి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B185 |
| పుస్తకం పేరు | విజయవిలాసము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | soumya |
| పేజీలు విడదీసినది | soumya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |